# RAGHUDAYAM

BY

TRIPURANA
VENKATA SURYAPRASATHA RAYA
KAVIGARU.



SIDHANTAM
( GANJAM DISTRICT )

1925



TRIPURANA VENKATA SURYA PRASADA RAO.

శ్రీరామనవమీ ద్వితీయ పూజాపుష్పము.

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# ర ఘూ ద య ము.

ఇ ది

దంతెహూలండా ప్రొప్రయిటరును

నిర్వచన-కుమారసంభవ, రఘువంశ, కిరాతార్జునీయోత్తరరామచరిత్ర

నాటకాది గ్రంథకర్తయును

అ గు


మహారాజశ్రీ

శ్రీత్రిపురాన - వేంకటసూర్యప్రసాదరాయకవిగారిచే


వి ర చిం పఁ బ డి.

బ్రహ్మశ్రీ

పండిత, పురాణం - సూర్యనారాయణతీర్థులవారిచేఁ

పరిష్కృతమై


చె న్న పు రి;

ఆనందముద్రణాలయమున

ము ద్రిం పిం చి

గ్రంథకర్తచేఁ

ప్రకటింపఁబడినది.

1924




Price 8 As.] [దీనివెల 8 అణాలు

శ్రీ

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# ఇష్టదేవతాప్రార్థనము.

క. దానదయాసత్యాదిని
ధానమ్మును నాదుతండ్రిం దమ్మయసుకవిన్
ధ్యానింతు భజింతుం దదా
స్థానకవిన్ నాదుగురుని సాంబయశాస్త్రిన్. 1

ఇంద్రవజ్రము. శ్రీరామ! భక్తోత్పలశీతధామా!
కారుణ్యవారాకర! కల్యనామా!
భూరిప్రభావా! పరిపూర్ణకామా!
వీరాగ్రణీ! దానవభీమ! రామా! ౨

శా. దేవా! విన్నప మాలకింపుము భవ
ద్దివ్యాంఘ్రిపంకేజసం
సేవల్ నాదగుకోర్కికిం దగునటుల్
సేయంగ లేకుంటి నిన్
భావాతీతు నజస్రమున్ మనమునన్
భావించి సేవించుభ
క్త్యావేశంబును జిత్తశుద్ధియును నా
కర్థిం బ్రసాదింపవే. ౩

సీ. వాసస్థలంబు లక్ష్మీసరస్వతులకు
ద్ధాంత మైనట్టిసిద్ధాంత మనియు

జననంబు విద్యాయశశ్శ్రీగుణాకరం
బగు త్రిపురానవంశాబ్ధి ననియు
వ త్త దేవీభాగవతముఁ దెల్గించి పెం
పెన గుత్తమ్మయరాట్కవీంద్రుఁ డనియు
నిత్యకృత్యము భవశక్తిప్రీత్యర్థమై నవ్య
కృతిపుష్పపూజ లర్పించు టనియుఁ
తే. జెప్పికొనుట కుత్సాహంబుఁ గ జెందఁ దగిన
యిట్టియౌన్నత్యగరిమ నా క కిచ్చినావు
వినుతి సేయంగఁ దరమె నీకవినమదవన
దక్షసత్పక్షకరుణాకటాక్షమహిమ.

చ. కడుకొని యన్యులం గుమపు
కక్కుఱితిం జెయి సాఁపకుండఁ దాఁ
గుడువఁగఁ గట్టఁగా నొరుల
కుం దగఁ బెట్టఁగఁ జాలినంత యె
క్కుడుసిరు లిచ్చి దానఁ బ్రతి
కూలమదాదివికారచేష్టలం
బడి చెడనీక నీదుపద
భక్తునిఁ జేసితి వింత యొప్పదే.

ఉ. శ్రీకరసాత్త్వికప్రకృతిఁ
జేసి సమానులలోన నుత్తమ
శ్లోకుఁ డితం డటంచు బుధ
లోకమువాకుల కెక్కఁ జేసి తా
హా! కొఱ గానివాని నను
నంతటి పెద్దలు నంతవానిఁగాఁ

గైకొను టెన్న నీకరుణ
గాదె యదెంతకు నైనఁ జాలదే. 6

క. సకలము నొసఁగియు నేదే
నొక ప్రబలవిషాదహేతు వొదవించి నరున్
వికలాత్ముఁ జేసి కలఁచెద
వకటా నీలీల లెఱుఁగ నగునే దేవా! 7

ఆ. జనులపూర్వకృతమొ సంసారధర్మమో
పఱచి నిన్ను నెఱుక పఱచుతలఁపొ
ప్రాణికోటి కిదియ ప్రకృతియో సంసారి
కెన్ని యున్న సౌఖ్య మెన్న సున్న. 8

ఉ. జ్ఞానరసానుభూతియును
సర్వసమత్వము నీదుభక్తియుం
బూని భవన్మయం బఖిల
మ్మున్ మఱి వేఱగువస్తు వేదియుం
గానమటంచుఁ జిన్మయవి
కాసవిలాసధురీణు లైనను
జ్ఞానుల కేమొ కాని ఘన
సంసృతిమగ్నుల కేడ సౌఖ్యముల్. 9

చ. కడుఁ బసినాఁటనుండియు న
గాధవిపజ్జలరాసు లీఁదుచుం
గడ గన లేక నీచరణ
కంజము లూఁతగ నింతకాలముం
గడపితి నెట్టులో యిఁక న
ఖమ్ముల కేమి విముక్తి నిచ్చనీ

యడుగుల నెప్పుడుం గొలుచు
నట్టిప్రశాంతి ననుగ్రహింపవే.

చ. అనయము వచ్చునాపదల
యం దొకవింతసుఖమ్ము దోఁచెడుం
దినఁ దిన వేముఁగూడఁ గడుఁ
దియ్యన యౌ నని యందురే కదా
నిను మది నుంచునీతియు వి
నీతియు భీతియుఁ గల్గుసాధువ
ర్తనము ఘటించుఁ బాపములఁ
గాల్చు విపత్తుల కీడె సౌఖ్యముల్.

చ. ఇడుములు వొందుఁ గాక యన
దే ఋజుమార్గవిహారి కష్టముల్
వడియును ధర్మ వేమఱక
వర్తిలి మ న్నవతారమూర్తు లె
ల్లెడ నిజకీర్తిచంద్రికల
నీభువనంబు నలంకరింప రే
యిడుములు గావె కారణము
లీశ్వరభక్తికిఁ బాపముక్తికిన్.

సీ. అఖిలేశ! పాపకృత్యమ్ము గావించునా
పదలు భక్తులకు సంపదలు గావె
నలినాక్ష! నీకీర్తనమును జేయించునా
పదలు భక్తులకు సంపదలు గావె
రఘువర్య! జ్ఞానవైరాగ్యమ్ము లిచ్చునా
పదలు భక్తులకు సంపదలు గావె

యవిచింత్య! నీవ నేనని తోఁపఁ జేయునా
పదలు భక్తులకు సంపదలు గావె
తే. యిడుమలే కల్ములని కల్ము లిడుమ లని సు
ఖమ్ము దుఃఖమ్ము చిత్తసంకల్పిత మని
చక్కఁ దెలిపి తాపదలకు స్రుక్క నింక
నీదుదయ గల్గఁ గీడు మేల్గాదె యీశ! 13
శా. కాయంబుల్ క్షణభంగురంబులు సుఖా
కాంక్షల్ మనోభావముల్
శ్రేయంబుల్ బహువిఘ్నముల్ పరజన
క్షేమాసహిష్ణుత్వదీ
క్షాయోగాంధులు లోకు లెట్లు సుకృతుల్
సాఁగింప వచ్చున్ మహా
పాయోద్విగ్నవిపన్నఖిన్నత గడుం
బైకొన్నమాబోంట్లకున్. 14
ఉ. మంచిపనుల్ ఘటింప నడు
మన్ బహువిఘ్నము లావహించు లో
నెంచఁగ రానికానిపను
లెట్లును జేయక తీర దంచుఁ దోఁ
పించుఁ బురాకృతంబో విధి
ప్రేరణయో కలిదోషమో కటా
వంచిత మైనయీబ్రదుకు
వచ్చుట నీకృప చాలమిం గదా. 15
ఆ. చాఁపక్రిందినీటిచందాన నేటిలో
నడచునోడపగిదిఁ గడచుఁ గాల

మెంతో చేయఁ బూని కే యేమియుఁ జేయని
వాఁడ నైతి నింతకేవఱకు నయయొ. 16

ఉ. పుట్టువుకల్మికిన్ ఫలము
పో నిను భక్తి భజించి ముక్తి చే
పట్టుట దానిఁ గైకొనని
పామరునిన్ నను నెట్లు గాచెదో
పొట్టకు లేక యేగతులఁ
బోయినఁ బోదురు గాక కల్మికిం
బట్టయి యుండి నిన్ మఱచు
వారకటా విధివంచితుల్ గదా. 17

చ. బురదను దోఁచు పంకజము
పోలిక నాదుమదిం గవిత్వవి
స్ఫురణము గల్గఁజేసి దయఁ
జూచితి వంతియ చాలు నాకు నీ
కరుణను గన్నయాకవితఁ
గ్రమ్మఱ నీక యొసంగఁ బూనితిన్
వరద! యిదే భవచ్చరణ
వారిజపూజన మంచు నెంచుమా. 18

తే. ప్రథమకృతి యాకుమారసంభవము నీకు
నే సమర్పించి నేఁటి కేండ్లు గడచెఁ
గొన్నికృతు లీనడుమఁ జేసి యున్న నకట
ప్రకటితములు గా కవి మూలఁ బడఁగ వలసె. 19

క. పూర్ణము లై కొన్ని యసం
పూర్ణము లై కొన్ని యుండిపోయెఁ గృతులు చిం

తార్ణవమగ్నుం డేగతిఁ
దూర్ణము వెలయింప నేర్చు దొరఁకొన్నకృతుల్. 20

సీ. పదునాల్గునెలల లేఁబ్రాయంబునన యొంటి
నను డించి నినుఁ జేరుకొనినతండ్రి
"నన లేన కి" మ్మన్నయార్యోక్తి సత్యసం
వాదంబు గావించువారి తెఱఁగుఁ
గోర్కుల కేపాటికొదవ వాటిలనేని
పగఁ బూని జగడించుబంధుకోటి
నొడలిలో సగము దా నెడఁబాసి వగపునై
నాత్మవిశ్రాంతి లేనట్టిబ్రదుకు
తే. భవపయోధిభంగములలోఁ బడి మునింగి
నిన్ను మనసారఁ గొలువంగ నేరకునికిఁ
దలఁచికొనినప్పు డెల్లఁ జిత్తమ్ములోన
నింత యం తనఁగా రానిచింత పొడము. 21

సీ. అఖిలజగమ్ముల కాదికారణుఁడ వై
తనరారునీవ నాతండ్రి వనియు
నకృతబుద్ధులచేత హాని వాటిల కుండ
సాధులఁ గాచురక్షకుఁడ వనియుఁ
గోర్కు లన్నియును జేకూర్చి భక్తుల నెల్లఁ
దనియించునాత్మబాంధవుఁడ వనియుఁ
బాపబంధముల నాపదలఁ బాపి విముక్తి
పథఁ జేసి నినుఁ జూపుగురుఁడ వనియు
తే. భవసుఖాభాస మెఱిఁగించి భ్రాంతు లుడిపి
నిన్ను నిశ్చింతఁ గొలిపింప నేర్తు వనియు

నెంతచింత వాటిలిన నొక్కొక్కింత గాఁగ
నెంచి కడు భక్తి ని న్నాశ్రయించినాఁడ. 22

చ. ధనమును గోరలేదు సము
దంచితపుణ్యచయమ్ము యాన లేం
ధనమును భోగసౌఖ్యకల
నంబును గోరఁగ లేదు దుఃఖబం
ధనమును బాపి నిత్యకవి
తామయదివ్యతపఃప్రవృత్తి సా
ధనముగఁ గాలముం గడపు
ధన్యత నాకు ఘటిల్లఁజేయవే. 23

సీ. సతతంబు సంగీతసాహితీకవితార
సాబ్ధివీచుల నోలలాడుకోర్కి
యవిరతంబు రసజ్ఞకవిసాధుబుధభక్త
జనులతో సద్గోష్ఠి సలుపుకోర్కి
యనిశంబు నిను మహార్ఘామోదసురభిళ
త్కృతిపుష్పతతుల నర్చించుకోర్కి
నిరతంబు భవదీయసరససచ్చరితామృ
తము నీనులారఁగాఁ ద్రావుకోర్కి

తే. యెల్లకోర్కులకంటెను హెచ్చు నాకుఁ
గోర్కు లివ్వియుఁ దగఁ దీర్పఁగొనెడుశక్తి
నిచ్చియును దగునవకాశ మీయ వెతి
పూర్ణఫల మబ్బునే యల్పపుణ్యులకును. 24

మ. అవకాశం బెటు లబ్బు సత్క్రియలకీ
ర్త్యాదుర్గ్రహాగ్రస్తమా

నవనిర్ణేతువివాదసంఘటితబం
ధగ్రంథినిర్మోచన
వ్యవసాయవ్యయితాత్మజీవితున కౌ
రా యిట్టికష్టంపుఁబు
ట్టువు లేచెట్టులకుఁ ఫలంబులౌ విరా
డ్రూపా! యెఱింగింపవే. 25

సీ. ధర్మార్జనకు నైన ధనము వ్యర్థమ్ముగాఁ
జెడువివాదముల వెచ్చింపవలసెఁ
బుణ్యతీర్థాటనంబున కౌనడుఁగుదోయిఁ
దిరుగఁ గూడనిచోట్లఁ ద్రిప్పవలసెఁ
గవితావిలాససంగతి కైనకాలంబుఁ
బడరానిపాటులం గడపవలసె
భవదంఘ్రినిధ్యానపరత కాచిత్తంబుఁ
జెడుఁగుచింతలకుఁ బాల్సేయవలసె
తే. సుజనపండితకవిచక్రవర్తికి నైన
వీనులను దురుక్తుల కొప్పింపవలసె
నౌకరి నన నేటికి నిడెల్ల నకట వికట
దుర్విలంఘపురాకృతదోషఫలము. 26

క. కడలితరంగలవఘువున
నుడుగక యొకదానిమీఁద నొకటిగఁ దనపైఁ
బడు దైవమానుషాపద
లుడికింపవె యెంతవానియుల్లము నైనన్. 27

క. కొంచక మేలని కీడని
యెంచక సకలంబు మంచికే వచ్చెనటం

చెంచు మని పెద్ద లం ద్రది
చంచలత నడంప మంచిసాధనము గదా. 28

క. మాత్సర్యం బుడిగి మహా
పత్సమయములందుఁ దోడుపడువారల దా
సత్సహావాసము దొరకిన
నుత్సవములు గాఁగఁ దోఁచు నుగ్రాపదలున్. 29

క. సంగము బంధమ యగు స
త్సంగము నిస్సంగతిప్రదం బయి శ్రేయ
స్సంగతి నిడుఁ గావున స
త్సంగము గలనెలవు నిత్యసౌఖ్యము నొసఁగున్. 30

ఆ. పట్టనములలోని పని లేనిబెడదలఁ
దెచ్చికొనక మనఁగ వచ్చుఁ గానఁ
బల్లెటూళ్లలో నివాసంబు సేయుట
శాంతితత్పరులకు సౌఖ్యకారి. 31

సీ. అళికీరకోకిలాకులితనానాలతా
తరుశోభితారామతతులచేత
జలపక్షికలకలోజ్జ్వలలఘుస్వచ్ఛాంబు
కమనీయకమలాకరములచేత
ఫలసంపదభిరామబహుసస్యసంభార
సలలితక్షేత్రరాజములచేత
నారోగ్యహృద్వికాసానందసంధాయ
కోల్లసద్విమలవాయువులచేత

తే. నీశ్వరునిసృష్టివైచిత్రి నెఱుకపఱచి
ప్రకృతిసౌభాగ్యసారానుభవము గూర్చి

మించుపల్లెటూళ్ల నివ×సించునట్టి
కవులభాగ్యంబె భాగ్యంబు × గాదె దేవ! 32
ఆ. కాలవైపరీత్య×కలన నేఁ డది యేమొ
తొంటిపేరు పెంపు × ద్రోచిపుచ్చి
పట్టనములకంటెఁ × బల్లెలు పా డయ్యె
లేనిపోనితగవు × లూనుకతన. 33
సీ. గ్రామాభిమానంబు × గలిగి యెల్లపుడైక
మత్యంబుమైఁ గూడి×మాడి యునికి
నిండుకూరిమితోడ × నొండొరులను సౌఖ్య
దుఃఖవేళలయందుఁ × దోడుపాటు
కృషిగోకులాభిర×క్తైకవృత్తిని గడుం
బావనం బై యొప్పు×జీవనంబు
దేవతాబ్రాహ్మణా×తిథిపూజనాసక్తిఁ
గీర్తనీయం బైన×వర్తనంబు
తే. గలిగి యుండినజనులచే × వెలసెనేని
పల్లెటూరికి సరి రాదు × పట్టనంబు
కాని యటు గాక విపరీత × మైనయెడల
దుర్గతిప్రాయ మై మదిఁ × దోఁచుఁ గాదె. 34
ఆ. ఒరులపచ్చ సూచి × యోర్వమి నొండొరుల్
ధర్మ వెడలి వృథగఁ × దగవులాట
యీసురోసములును × దోసంపువేసముల్
పల్లెటూళ్ల ప్రజకుఁ × బ్రకృతి యయ్యె. 35
తే. పల్లెలం దుండెడుజనంబు × స్వల్ప మందు
నొచ్చె మగువృత్తి మనువారు × హెచ్చు వార

లూర కుండ రుండెడువారి నుండనీరు
శాంతిసంపద యెట్లబ్బు సాధువులకు. 36

ఆ. కట్టుఁబాటు సెడిన యిట్టికట్టిఁడిపలె
టూళ్ళలో వసించి యుంటకంటెఁ
బట్టనములలో నివాసంబు సేయుటే
కడకుఁ గొంత మేలు గాఁగఁ దోఁచు. 37

చ. ఒకరిప్రసక్తి యింకొకరి
కుండదు పెక్కుజనంబుకల్మి ని
చ్చకు ననుకూలు రాజనుల
సంగతి స్వేచ్ఛఁ జరింపఁగా నగున్
సకలపదార్థముల్ దొరకు
సర్వవినోదములున్ ఘటిల్లెడున్
నుక మొనగూర్పదే తలఁచి
చూడఁగఁ బట్టనవాస మెమ్మెయిన్ 38

ఆ. పట్టనములఁ గాని పల్లెటూళ్లఁ గాని
మంచిసెడ్డతనము లెంచ నేల
యొడలి కాత్మవ్రోలె నూరికి జనసంఘ
యుక్తి సూవె బాగు నోగుఁ దెచ్చు. 39

ఆ. సంఘవశతఁ గల్గు సౌఖ్యదుఃఖములు స
త్సంఘ మిహపరైకసాధనంబు
కడు నశాంతి గూర్చు చెడుగుసంఘముతోడి
బ్రదుకుకంటె విపినవసతి మేలు. 40

సీ. సరసంపుఁగబ్బంబు విరచించి వినిపింప
సారం బెఱిఁగి మెచ్చువారు లేరు

జను లెంచునత్కార్య ♦ మొనరింపఁ గని మనం
బార సంతోషించు ♦ వారు లేరు
వెరవునై మన సిచ్చి ♦ సరససల్లాపత
త్పరులై వినోదించు ♦ వారు లేరు
సంపదాపదలందు ♦ సరిగఁ దోడ్పడి మనో
హరులై కౌఁగూడు ♦ వారు లేరు
తే. మంచిచెడ్డలు దగ విచా ♦ రించి తగిన
దారి నారసి చరియించు ♦ వారు లేరు
కటకటా సుఖవాసయో ♦ గ్యమ్ములైన
పల్లెటూళ్ళలస్థితి నేఁడు ♦ పాడువడియె. 41
శా. సారాచారులు సాధుదీనజనతా
సంరక్షకులే బంధుమం
దారుల్ ధీరులు పాపదూరులు మహో
దారుల్ జగత్సన్నుత
ప్రారంభుల్ హరిభక్తులాఢ్యులు మహా
రాజన్యపూజ్యుల్ యశ
శ్శ్రీరమ్యుల్ సనినారు పెద్దలు గుణ
శ్రీవైభవోపేతులై. 42
సీ. సరసనిర్మలసార ♦ జలపూర మింకిపోఁ
గడను శేషించు పం ♦ కంబువోలెఁ
గలహంసముఖపక్షి ♦ కులము వో నిట్టట్టు
దిరుగాడుచుండుకొ ♦ క్కెరలువోలె
నెత్తమ్ములును గల్వ ♦ మొత్తమ్ములు నశింపఁ
దుదకుఁ జిక్కినతుంగ ♦ దుబ్బులట్లు

జాలరుల్ వలల మత్స్యము లెల్లఁ గొంచుఁ బోఁ
గొనకు నిల్చిననత్తగుల్లలట్లు
తే. లున్నకొందఱతోఁ గూడి కొన్నియాళ్లు
కాలగతి నెండుకోలఁకులఁ బోలి యుండెఁ
గలుగునే వీని కిఁకఁ బూర్వవిలసనంబు
హరికృపాలోకవర్షోదయమునఁ గాక. 43
ఆ. జగదధీశ! నీదుసంకల్ప మెట్టిదో
యెంతలో ఘటిల్లు నెంతమార్పు
క్రిందు మీఁదు మీఁదు క్రిందౌచు భ్రమియించు
బండికమ్మివోలెఁ బరఁగు జగతి. 44
సీ. ఉరుతరోన్నతి గన్నయూళులు పాడౌట
హీనంబు లగునూళు లేపు గనుట
యతిదరిద్రజనమ్ము లర్థాధిపతు లౌట
లక్షాధికారులు భిక్షు లౌట
ఘనతరవంశముల్ గాలి బొగ్గౌటయు
నధమవంశములు మిన్నందుటయును
సత్పూరుషులకు దుర్జనులు సంభవమౌట
ఖలులకు సజ్జనుల్ గలుగుటయును
తే. నేఁడు సౌఖ్యాబ్ధి నోలాడువాఁడు రేపు
మహితదుఃఖాంబురాశినిమగ్నుఁ డగుట
యారకన్నారఁ జూచుచున్నార మిందు
నుచ్చనీచదశలఁ బొందుచుండు జగము. 45
క. గతకాలము మేలగు నా
గతకాలముకంటె ననెడు కాలజ్ఞులభా

పితములు దప్పునె నీ వే
గతిఁ దలఁచిన నట్ల యగును గాదే దేవా! 46

సీ. ప్రోడు లైనమహీజములు పల్లవింపవే
యతిరమ్య మగువసంతాగమమున
శర్కరలై కావ శేషము లైనయేఱు లొ
ల్లొరసి పాఱవె వార్షికోదయమున
బహుళాంధకారైకబంధురంబు లగురేల్
ప్రభల నింపవె శుక్లపక్షవేళ
నీహారసంపాతనిహతపద్మవనమ్ము
లలరారవే తుషారాత్యయమునఁ

తే. గాల మనుకూల మగునేని మేల కలుగు
నదియ ప్రతికూల మగునేని కొదవ గొదవుఁ
గాలమే సర్వమునకును గారణంబు
కాల మన నేమి నీవ కా కాలరూప! 47

తే. కాలరూపుఁడ వైననీలీల లిట్టు
లవిరతము జగన్నాటకం బాడుచుండు
నీవ కర్తవు భోక్తవు నిఖిలలోక
ములును నీచేతికీలుబొమ్మలు గదయ్య. 48

మ. ధనహానిన్ గణియింపలేదు నిజచి
త్తక్లేశముల్ లేశముం
గొనఁగా లేను శరీరకష్టమును గై
కో లేదు మేలే యొన
ర్చెను నా కిన్నియుఁ గాని శ్రీవర! భవ
త్ప్రీత్యర్థ మై కావ్యసే

వనవృత్తిన్ నిరతం బవిఘ్నముగఁ జ
ల్పన్ రామికిం గుందెదన్ 49

ఉ. చెప్పికొనంగ నేల యని
చెప్పక యొప్పరికించినన్ మనం
బొప్పక యున్న దున్నయటు
లోడక యాడు మ టంచుఁ జెప్పెదం
జెప్పినఁ జెప్ప కున్నను బ్ర
సిద్ధము లియ్యవి గాన నింతయుం
జెప్పితి నీకు నావగవు
సెప్పక యెవ్వరితోడఁ జెప్పెదున్. 50

మ. మన మాపన్నిహతిం గలంగనెడ స
మవ్యగ్రధైర్యముం గొల్పి క
ట్టనుఁగుంబ్రాణము లొడ్డి యైనఁ దగుసా
హాయ్యమ్ము గావించి ప్రీ
తిని నా కెంతయుఁ గూర్చుచున్ "యది సుహృ
ద్దివ్యావతైగ కిం ఫల"
మ్మని తోఁపించెడుమిత్రకోటి గల ద
న్నా! వంత నా కేటికిన్. 51

క. మిత్రుఁడ వై సుఖము లొసఁగి
శత్రుఁడ వై వగల నఘముఁ జక్కడఁచి జగ
ద్వ్యాత్ర నడపింతు వీవే
శత్రుఁ డెవఁడు మిత్రుఁ డెవఁడు జగతి బుధులకున్ 52

సీ. చిమ్మచీఁకటులు పైఁ గ్రమ్మునమాసరేల్
వెలసినం గాదె వెన్నెలలయింపు

ఉమ్మెత్తపూలయం దొదవుదుర్గంధంబు
గలిగినం గాదె చెంగలువతావి
మండువేసవిఁ బుట్టునెండకాఁకలఁ గాదె
మలయాద్రిపిల్లగాలులబెడంగు
పూతిగంధము గల్గుబురదగుంటలఁ గాదె
రమణీయకమలాకరంబుసొబగు
తే. చెడుగు గల్గినఁ గాదె మంచికిని బేరు
సదయ! నీసృష్టిమర్మంబ యిది గదయ్య
తారు సడి కోర్చి పరుల నుదారకీర్తి
పరులఁ జేయువా రుపకారపరులు గారె. 53

ఉ. కర్మము సౌఖ్యదుఃఖములఁ
గల్గఁగఁ జేయు నటం చెఱుంగుదుర్
దుర్మమకార మొక్కపుడు
దోఁచి యడంచెదుః దద్వివేకముల్
నిర్మలతత్త్వవేత్త లయి
నిన్ను భజించెదుః యోగులైన నీ
మర్మ మెఱుంగ నేరరు ర
మావర! యజ్ఞుఁడ నేను నేర్తునే. 54

మ. బహుజన్మార్జితవాసనాబలముచే
భ్రాంతిన్ విసర్జింపలే
కహహా మేలిది కీడి దంచు నెదలో
నామోదఖేదమ్ము ల
న్వహముం బొందుచు నుంట గాకరయ బ్ర
హ్మానందమే కాదె యీ

యిహలోకమ్ము భవన్మయం బనెడుత
ద్దృష్టిం గనన్ నేర్చినన్. 55

శా. నీసంకల్పము తక్క వేఱొకటి కా
నేకాదు నీయిచ్ఛమె
నాసన్నం బగునట్టి దే దయినఁ బూ
ర్ణానందుఁ డై సర్వ మా
భాసం బంచు నెఱింగి తా ననుభవిం
పం జెల్లుఁ గా కేల వే
రాసల్ వొంద నిమిత్తమాత్రుఁడు గద
య్యా! మానవుం డన్నిటన్. 56

ఉ. ఇమ్ముగ బొమ్మరిండ్లు ఘటి
యించుగతిం బ్రకృతిస్వరూప నీ
తమ్మ మదంబ లోకసృజ
నాదృత వై యట బిడ్డలన్ మమున్
బొమ్మలఁ జేసి యాడుకొను
పోఁడిమి వేడుకఁ జూచుచుందు వీ
వెమ్మెయి నిత్తెఱం గెఱుఁగు
టే సకలాగమసార మాఁ గదా. 57

సీ. సత్పూరుషులతోడి సాంగత్యమున సక్తి
దుష్టసాంగత్యముం దును విరక్తి
యఖిలలోకేశుండ నైననీయెడ భక్తి
యాత్తైకదమనంబు నందు శక్తి
పరగుణంబులయందుఁ బరమ మాసంప్రీతి
గురుజనమ్ములయందు గురువినీతి

పరదారధనపరత్వమునఁ బొందనిరీతి
లోకనిందకు నాత్మలోన భీతి
తే. భవ్యసత్కవితైకవిద్యావ్యసనము
హరిశుభకారి రాజయోగాభ్యసనము
నాకు దయచేసి జన్మబంధములఁ గోసి
విమలకైవల్యపదము నీవె పరేశ! 58
శా. క్షమియింపంగదవయ్య! సాధుజనహిం
సాప్రజ్ఞ లౌనజ్ఞులన్
సమయింపంగదవయ్య! తత్కృతజగ
జ్జాలవ్యథాభారమున్
దమియింపంగదవయ్య! మత్ప్రబలచిం
తావార్ధిభంగమ్ములన్
రమియింపంగదవయ్య! మామకమనో
రాజీవరంగమ్మునన్. 59
క. చింతాజ్వరాభితప్త
స్వాంతుం డేపనియుఁ జేయఁజాలఁడు కరుణా
వంతుఁడవయి యీపయి ని
శ్చింతత సత్కృతులఁ గృతిని జేయవె నన్నున్. 60
తే. ఇట్టిచింతాబ్ధిఁ బడకున్న నింత కేను
నెలకు నొకకృతి రచియించి నీపదముల
కర్పణము సేయకుందునే యక్కటకట
పోయె వృథ గాఁగఁ గాలంబు ప్రాయెఁ బోయె. 61
మ. బ్రతుకెల్లన్ వృథ గాక యుండఁగ గతా
బ్దం బాదిగా నోదయా

ప్లుత ! నేఁ బూనితినీదు చైత్రనవమీ
పూజోత్సవంబందు స
త్కృతిపుష్పం బొక టింతనుండియును నేఁ
డేటేఁట సమర్పింప నూ
ర్జితభక్తిన్ నియమంబు చేసితిని దం
డ్రీ ! దీనిఁ జెల్లింపవే. 62

తే. ఇట్లు కృతిసుమార్చన సేయుకెనిచ్చ నాకుఁ
గొలుపవైతి నిరుడు పూజ కె సలుపువేళఁ
బ్రథమకృతి యాకుమారసంభవము నిరిటి
ప్రథమపూజకుఁ గల దన్నభావ మేమొ. 63

తే. కాళిదాసునిరఘువంశకావ్యమందుఁ
గలకథం గొని శ్రీనాథకవివరేణ్యు
నైషధాంధ్రీకృతిపథంబునన్ నిజేచ్ఛ
పాదుకొన రచించితి నీరఘూదయంబు. 64

ఉ. నీకులకర్త సర్వధర
ణీవరమౌళిమణిచ్ఛవిచ్ఛటా
స్వీకృతపాదపీఠుఁ డగు
శ్రీరఘునభ్యుదయంబుఁ దెల్పు నా
యీకృతి నీకు భక్తిమెయి
నిచ్చితిఁ జన్నవమీద్వితీయపూ
జాకుసుమంబు గాఁగ రఘు
సత్తమ ! దీనిఁ బరిగ్రహింపుమా. 65

ఉ. పద్మపురాణసంహితను
భాసిలునీకథ సత్కవీంద్రహృ

త్పద్మము లుల్లసిల్ల రఘు
వంశమునన్ సుకవిత్వసత్కళా
సద్మము కాళిదాసకవి
చంద్రుఁడు సెప్పె న దేను జెప్పితిన్
బద్మదళాక్ష! గ్రోలవె భ
వత్ప్రపితామహసత్కథాసుధన్. 66

ఉ. పూవు ల వెన్నియో కలవు
పూజకు నైన న వెల్లఁ దావకా
ర్చావిధి కీకృతిప్రసవ
రాజముఁ బోలునె కల్పకప్రసూ
నావళివోలె వాడదు ని
రంతరముల్ లలితార్థసౌరభ
శ్రీ విడ దెన్నఁడుం జెడదు
శ్రీవర! నీ కిది యింపు నింపదే. 67

తే. అర్థి సిద్ధార్థివత్సరం బాది గాఁగఁ
గడఁగి నీనవమీపూజఁ దొడఁగినాఁడ
నవ్యకృతిపుష్పపూజార్పణంబు సేయు
వాఁడ నైతి నీరౌద్రిసంవత్సరమున. 68

సీ. సరసాభినవకావ్యవిరచనాసంపత్తి
నాంధ్రభాషాసేవ యతిశయిల్ల
భావిజీవిత మెల్ల భవదర్చనాలబ్ధ
సుకృతసంకలన సార్థకత నొందఁ
జన్మజన్మాంతరసంపాదితానేక
దుష్కర్మబంధముల్ దొలఁగి పోవ

స్వకులక్రమాగతసత్కీర్తిచంద్రిక
లాచంద్రతారకం బవని నిలువ
తే. నిట్టు లేఁటేఁట నొక్కొక్క కృతినుమంబుఁ
జైత్రనవమీసమర్చనాసమయములను
జిరము నాచేత నర్పింపఁ జేసికొనుచు
నన్నుఁ గృతకృత్యుఁ జేయు మనాథనాథ ! 69
క. అసమత్రిపురానకులవి
లసితుఁడ భవదీయపదజలజభసలన్నా
నసుఁడను వేంకటసూర్య
ప్రసాదరాయఁడ సుకవిపదసేవకు డన్. 70





శ్రీ

రామచంద్ర పరబ్రహ్మణే నమః.

# రఘూదయము

## ప్రథమాశ్వాసము.



శ్లో. అన్వయం పావితుం భానోర్నిమేర్లోకాన్ కవేర్వచః।
అవతారో యయోః పృథ్వ్యాం దమ్పతీ తౌ భజామ్యహమ్॥


మహీజామనోజ్ఞాభిరామ! రామ!
యరివిరామ! గుణారామ! యవధరింపు
నీనవమిపూజనంబుఁ బుష్ప మైనయట్టి
యీరఘూదయకావ్యమం దెనఁగుకథను. 1

క. శ్రీపతినిభుఁ డమలగుణాక,
లాపుం డిక్ష్వాకుకులజలధిసోముఁ డయో
ధ్యాపురవిభుఁ డనఘుండు ది,
లీపుండు హృతాహితావలేపుం డలరున్. 2

ఉ. ఉత్తరకోసలమ్ముల మ౯నూదితధర్మపథానువృత్తి రే
కెత్తఁగ నప్రమత్తుఁ డయి ౯ యేలెడునానరపాలమౌళికిం
జిత్తము శ్రీముకుందపద౯సేవనలోలుప మయ్యె న్యాయ్యమౌ
విత్తము సాధుదీనబుధ౯వృత్తివిధాయక మయ్యె నయ్యెడన్.

సీ. చే సాఁచి తన్ను యాచించి వేఱొక్కని,
నర్థింపఁ బోయిన౯యర్థి యొకఁడు
అనిలోన నొకమాటు ౯ తనయేటు చవిచూచి,
వెన్నీక నిల్చిన౯వీరుఁ డొకఁడు
గణనీయ మగుతన౯గుణలక్ష్మి విన్నంత,
మది మెచ్చి పొగడని౯మనుజుఁ డొకఁడు
అఖిలవిద్యలఁ దన ౯ కధికుండు లేఁ డన్న,
పేరు మాన్పఁ గలట్టి౯ధీరుఁ డొకఁడు

తే. పుడమి వెదకిన నెందుఁ గ౯న్పడమి యొకఁడె,
యఖిలలోకాద్భుతప్రభా౯వాఢ్యుఁ డైన
యాకువలయాధిపతియతి౯లోకదాన,
శౌర్యగుణవిద్యలకు నిద౯ర్శనము గాడె. 4

శా. యాదోరత్ననికాయసంకలిత మా
నంభోధిరీతిన్ భయా
పాదిప్రీతివిధాయి రాజగుణసం
పద్భాషితుం డైనయా
త్మోదారోత్తముఁ డాశ్రితావళికి నా
త్మన్ భీతియుం బ్రీతియుం
బ్రాదుర్భావము నొందఁ జేయు నతిదు
ర్ధర్షాభిగమ్యాకృతిన్. 5

సీ. ఆత్మకర్మపటిష్ఠ మగుదృఢాంగసమృద్ధిఁ,
దనువు దాల్చినక్షాత్రధర్మ మనఁగ
నతిలోకతేజోబలౌన్నత్యధీరతా,
సంపత్తిఁ గాంచనాచల మనంగ
జగదేకమోహనసౌభాగ్యరేఖావి,
శేషంబునను గుసుమేషుఁ డనఁగ
శిష్టరక్షణదుష్టశిక్షావిచక్షణ,
తానిరూఢిని రమాధవుఁ డనంగ
తే. నాకృతికిఁ దగుప్రజ్ఞ ప్రజ్ఞాతిరేక,
మునకుఁ దగుచదువును జదువునకుఁ దగిన
క్రియయుఁ గ్రియకును దగుఫలోదయము గలిగి,
యఖిలజగదభినుతుఁ డయ్యె నవ్విభుండు. 6
చ. ఇనుఁ డటమీఁద వేమడుఁగు
లీ జలముల్ మును గొన్నయటు ల
య్యినుఁడు ప్రజాభివృద్ధికొఱ
కే కరముం గరముల్ గ్రహించుచున్
మనువుమొదల్ కడున్ నలఁగు
మార్గము గీఱయు దాఁటకుండ భూ
జనముల నేమివృత్తుల న
జస్రముఁ దా నడపించు దక్షతన్. 7
సీ. ఒరులవృత్తి మెఱింగియును నేమియు నెఱుంగ,
నట్లుండెడుగభీరతాతిశయము
శక్తి గల్గియు నెట్టిశత్రునైనను క్షమా,
యుక్తిఁ గాపాడుదయోదయంబు

ఇచ్చ మీఱఁగఁ గోర్కు లిచ్చియుఁ దా మెచ్చి,
కో లొల్లనట్టిసుశీలగరిమ
కలిమి జవ్వనము మైబలిమి గల్గియును వి,
షయాసక్తి లేనివిజ్ఞానపటిమ
తే. యొక్కచోటన రెండును నుండనట్టి,
గానము లన్నదమ్ములువ్రాలెఁ గూడి యుంట
యితనియెడఁ గంటి మని బుధు లెన్న నతఁడు,
ముదిమి లేకయ వృద్ధత్వమును వహించె.
చ. అనయము రాజలాంఛన మ
టంచును సైన్యము లుంచెఁ గాని యా
మనుకులవారిసోమునకు
మానితనీతివిదగ్ధబుద్ధియుఁ
ధనువునఁ గూర్చినట్టిబలు
నారియు నేపని నెనఁ దీర్చుఁ జ
య్యాన నినవంశవీరు లస
హాయనిసర్గపరాక్రముల్ గదా.
సీ. శిష్టుం డహితుఁడైన నిష్టుండుగ గ్రహించు,
సతతంబు రోగి యౌషధముఁబోలె
దుష్టుండు ప్రియుఁడైన దూరంబునఁ దొలంగు,
వ్యాళదష్టం బైనవ్రేలిఁబోలె
శిక్షించి ప్రోచి సంరక్షించు నేప్రొద్దుఁ,
బ్రజల నెల్లను గన్నప్రజలఁబోలెఁ
జోరత నాత్మైకచోరత్వమున నిరా
శ్రయఁ జేయు గగనపుష్పమునుబోలె

తే. జనులస్థితికయి దండ్యదండన మొనర్చి,
పితరులఋణంబు దీర్పంగఁ బెండ్లియాడి
యర్థకామముల్ ధర్మార్థ మాచరించు,
నతనియశ మంద నన్యభూపతులవశమె. 10

ఉ. వాసవుతోడిచెల్మిఁ ద్రిది
వంబున కేఁగుచు నాకవాసులన్
గాసిలఁ జేయురక్కసుల
గండడఁగించుచు నాతఁ డింద్రున
ర్ధాసన మెక్కి సర్వదివి
జార్చితుఁడై సురమర్త్యలోకల
క్ష్మీసుఖసంస్థితిం దిరము
సేయు ద్వితీయమహేంద్రుఁడో యనన్. 11

చ. హయములు నాగముల్ మణిచ
యమ్ములు కాంచనరాసు లాదిగా
భయమును భక్తియున్ వెలయఁ
బార్థివు లర్పణచేయుకానుకల్
ప్రియమునఁ గొంచు దేవపరి
తృప్తికినై నిగమోక్తరీతి నా
యయమహితుం డొనర్చు వివి
ధాధ్వరముల్ బహుదక్షిణంబుగన్. 12

మ. మగధాధీశ్వరుకూర్మిపట్టి బుధసమ్మానార్హచారిత్ర భ
వ్యగుణోపేత సుదక్షిణాసతి కవీంద్రాపారవాగ్వర్ణనా
తిగసౌభాగ్యకలాకలాప తనకున్ దేవేరిగా నిత్యసౌ
ఖ్యగరిష్ఠస్థితి నవ్విభుండు నడపున్ గార్హస్థ్యధర్మంబులన్.

సీ. పుణ్యచారిత్రచేఁ బుట్టినయింటికి,
మెట్టినింటికి వన్నె వెట్టుసాధ్వి
సౌందర్యలక్ష్మిచేఁ జక్కనివారిలోఁ,
గడుఁ జక్కనిది నిపే ర్వడినకలికి
యఖిలవిద్యాప్రౌఢి నపరసరస్వతి,
యన్నపేరెన్నిక గన్నవిదుషి
పతిభక్తిసంయుక్తిఁ బదిరే లోకటి సేయు,
ననసూయ కుపమాన మైనగరిత
తే. సురథరాజేంద్రపుత్త్రి ప్రసూనగాత్రి,
ప్రణుతలక్షణ యా సుదక్షిణ నిజేశు
మన సెఱింగి త్రివర్గధర్మంబులందు,
నధిపునకు నెప్డుఁ దోడునీడై చరించు.
చ. గొనములకన్న వేయిమడుఁ
గుల్ తనచొక్కపురూపు రూపుక
న్నను మఱి వేమడుంగులు గొ
నమ్ములు నెక్కుడు ప్రీతి భర్తకుం
జెనుపఁగ నిండుజవ్వనముఁ
బ్రేమయు వానికిఁ దోడు గాఁగ నా
ఘననిభవేణి ప్రాణముల
కంటెఁ గడుం బ్రియ యయ్యె ఱేనికిన్
సీ. జగదేకసామ్రాజ్యచక్రవర్తిని యయ్యు,
గర్వ మెట్టిదో యెఱుంగనిది యనియు
నసమానభర్తృవాత్సల్యభాగ్యశాలిని యయ్యు,
దుడుకుఁబోకలకుఁ బాల్పడనిదనియు

సఫలితకోపప్రసాద యయ్యెను దల్లి,
గతి నాశ్రితులతప్పు గాచు ననియు
నతిలోకబహుళకళాచతుర యయ్యెను నిండు,
కుండవోలెఁ దొలంక కుండు ననియు

తే. మాన్యతరనిజాలోకసామాన్యగుణము,
లఖిలజను లిట్లు వినుతించు టాలకించి
వినుతగుణలక్ష్మికి మెఱుంగు వెట్టినట్లు,
చామ లజ్జాభరమున నెమ్మోము వాంచు. 16

చ. కడు సుకుమారమైనతన
కాయ మలంతకు సైఁపకున్నఁ బై
నుడిగపునెచ్చెలుల్ పలువు
రున్నను నాసతి దాన భర్తకిం
పడర సపర్య సేయుఁ దన
యర్మిలి భక్తియు సంభ్రమంబు నా
యొడయనిమానసంబును స
ముజ్జ్వలరాగరసాబ్ధిఁ దేల్పఁగన్. 17

సీ. ఎదురుగా నేఁగుచోఁ గొదమరాయంచల,
నడుము నెన్నడల సన్మానము నించి
కైదండ యొసఁగుచోఁ గైదండ నెసఁగుప్ర,
భోదయంబున దృగామోద మొసఁగి
పానుపుఁ జేర్చుచోఁ దా నొక్కచే నిడ్డ,
యరకౌఁగిలింత గగ్గుగు ఘటించి
చరణంబు లొత్తుచోఁ సరసంపుఁబలుకులఁ,
జెవులకు మివులఁ బండువులు చేసి

తే. యంతిపురికిని బతి వచ్చునపుడు తాను,
జేయుపరిచర్యకంటెను వేయిరెట్లు
విమలనిజదేహవాగ్విలాసములు పతికి,
నధికవిశ్రాంతి గూర్ప నయ్యతివ కొలుచు. 18

మ. తనమీఁదన్ గృహభార ముంచుపతికిం
దచ్చింత యావంతయుం
గననీ కంతయుఁ దాన పూని నడపం
గా నోపి యాయింతి కాం
తునకుం దా నృపనీతినిర్ణయములం
దోడై హితం బాడు మె
చ్చి నిజేశుం డిడుముద్దులం బులకముల్
చెక్కిళ్లఁ గైసేయఁగన్. 19

సీ. పరిజనంబులఁ జక్కఁబఱచుటకయి రిత్త,
యదలింపు లవసరం బైనయపుడు
భర్తమానసమందుఁ బ్రబలురాగరసాబ్ధిఁ,
బొంగింప మది నిచ్చ పొడమినపుడు
పతిమదనాంకసంపదఁ జూచి పరియాచ,
కము లాడఁబోటులం గసరునపుడు
ధవునిచే బల్మిమైఁ దనయెడం గలుగుకో
ర్కులను దీర్పించికోవలసినపుడు

తే. మనసులో లేనియల్క యాననమునందు,
నప్పుడప్పుడు దోఁపించు నంతె కాని
యఖిలభూతానుకంపార్ద్ర మైనయాపె,
యెడఁద నిక్కమ్ముగా నల్గి యెఱుఁగ దెపుడు. 20

ఉ. అన్నిట నుత్తమోత్తమత × నందినయామెలనాగసద్గుణా
భ్యున్నతి నెన్నఁగా వశమె × పొల్తుక లెట్టిగుణమ్ములన్ జగ
త్సన్నుతి గాంతు రట్టిగుణ×సంపదయుం దొకఁడుంగొఱంతలే
కన్నలినాక్షి చెన్నెసఁగు × నన్నను జాలదె వేయు నేటికిన్. 21

ఆ. ఇట్టియన్నుమిన్న × పట్టంపుదేవి యై,
తనుఁ గొలువ దిలీప×జనవిభుండు
కుం దెఱుఁగక స్వర్గ×మం దున్నయట్టు లా,
నందమయములుగ ది×నములు గడపు. 22

తే. మానితోజ్జ్వలరత్ననిధాన మగుచుఁ,
బ్రణుతి గన్నట్టియన్నెల×పణఁతికన్న
నతులగుణరత్నఖని యైన×యప్పొలంతి,
నెక్కుడుగ నాత్మ నెంచు న×య్యినకులుండు. 23

సీ. సారవాబ్జసుగంధ×సారవాహానిలాం,
కూరవత్పులినవి×హారములను
రాడగారాంతికా×క్రీడవల్లీగృహ,
క్రోడకల్పితముహుః×క్రీడనముల
చంద్రికాధవళిత×చంద్రశాలాగ్రసం,
పాదితలీలావి×నోదములను
రత్నచిత్రితలస×న్నూత్నకందరయుతా,
దభ్రలీలాశైల×విభ్రమముల

తే. నుల్లమునను రాగరసంబు × వెల్లివిరియఁ,
దనిసి తనియించుటయుఁ గూడఁ × దనవశముగ
జీవితేశ్వరితోఁ గూడి × యౌవనంబు,
సఫలముగఁ జేయు నారాజ×సత్తముండు. 24

కం. ఈగతి నతిశక్రమహో,
భోగంబుల నతఁడు ప్రొద్దు పుచ్చుచు రాజ్య
శ్రీగౌరవ మేమఱక స,
దా గోపరిపాలనవ్రతంబును జరపున్. 25

చ. తన కనురూపయై తగుసుదక్షిణగర్భమునందుఁ బుత్త్రునిం
గన మది నిచ్చ పుట్టి చిరకాలము తద్గతచింత నెంతయుం
మునుఁగుటె కాని కోర్కి తుదముట్టుటగానక వంతనొందునా
జనపతి పుత్త్రహీనులు విషణ్ణులకా తమ కెంత గల్గినన్. 26

కం. ఎన్నాళ్ల కయిన నిం కిటుఁ,
గన్నారఁగ సుతునిమోము గాంచెడుభాగ్యం
బున్నదొ లేదో నా క,
న్నన్నా! యని కుందు నన్నరాధిపుఁ డెపుడున్. 27

సీ. కొలఁకుల లేఁతతూఁడుల నేఱి బిడ్డల,
కందిచ్చుచున్న రాయంచగములఁ
బుక్కిళ్ల నెర నించి పోయి పొత్తుల నున్న,
పిల్లలకుం బెట్టుపిచ్చుకలను
గొణిగెలఁ బ్రియులతోఁ గొమరులలాలనల్,
పచరించుచున్నట్టిపాఫురముల
నగముకొమ్మలక్రింద నెగురుఁబిల్లల కభ్ర,
సంచారములు నేర్పుశారికలను

తే. నందునందును బొడగాంచినప్పు డెల్ల,
నెలమి ముచ్చట పరితాప మొసక మెసఁగ
నవుర! వీనియపత్యశోభాతిశయ మ,
టంచు వాల్గన్నులను నీరు నించు నతఁడు. 28

**మ.** అనపత్యత్వమహాఘవార్ధిఁ బడ దే
వా! తొంటిజన్మంబునం
దును నేఁ జేసినయట్టిదోస మది యే
దో దానిఁ బాపంగ నీ
యనుకంపామహిమంబు చాలదె కటా!
యంచున్ సముద్బాష్పలో
చనుఁడై వేఁడుఁ ద్రిసంధ్యముం దపను నా
సావిత్రుఁ డాత్రమ్మునన్. 29

**తే.** ఇట్టు లనపత్యతావ్యథాఘట్టనమునఁ,
దలఁకు సెందినతనదుడెందంబుకుందు
ప్రేయసికిఁ గొంత దగఁ బంచిపెట్టఁ దలఁచి,
నృపతి యొకనాఁడు ప్రియతోడ నిట్టు లనియె. 30

**మ.** అకటా! సూచితె దేవి! యాత్మకృతప
ద్మాప్తార్చనాభంగులం
దొక్క టైనన్ మన కిందు సాయపడ దే
మో పుత్త్రగారాబు నె
మ్మొకముం జూడఁగ నోఁచ మైతి మిఁక నె
ట్లో నీదుగర్భంబు పు
త్త్రకచంద్రోదయసంపదం గలశపా
రాశిన్ విడంబించుటల్. 31

**చ.** క్రతువు లొనర్చి యధ్యయన
కర్మరతం గడుఁ జేర్చి దేవసం
తతిబుధమర్త్యముఖ్యవరుల
నమ్మును దీఁచికొంటి నిం కిటం

బితరులయప్పు దీర్చి మన
పెద్దలు సన్నపథంబునం జనన్
మతిఁ దలపోసి యుండఁ గొఱ
మాలినదైవముచేత సూచితే. 32

సీ. ఏశ్రేయములఁ జేసిరో శ్రీకరాత్మజా,
భ్యుదయంబు విని మిన్ను ముట్టువారు
ఏసత్క్రియ లొనర్చిరో సుతాననశశి,
ప్రభలఁ గన్నులఁ జల్లఁబఱచువారు
ఏధర్మములఁ జేసిరో ధన్యతను దనూ
జునిఁ గవుఁగిటఁ జేర్చి చొక్కువారు
ఏపుణ్యము లొనర్చిరో పుత్రుక్రీడలఁ,
గను చేఁడు గడియగాఁ గడపువారు

తే. తొంటిపుట్టున మన మట్టివంటిసుకృత,
ములను జేయఁగలేదు గాఁబోలు గోల!
సకలమును గల్గియును గొడు కొకఁడు లేమి,
నఖిలమును లేనియట్లయ్యె నకట! మనసు. 33

చ. కిలకిలలేఁతనవ్వు లెడఁ గీల్కొని నున్ననిపాలబుగ్గలం
దలతలచిన్ని వెన్నెలలు దార్కొన వచ్చియురానిపల్కులన్
సలలితభంగి నీయఁటచాఁటునదాఁగిలిమూఁతలాడుచుం
జెలఁగెడుపుత్రువక్త్రసరసీజము ముద్దిడఁగల్గు టెన్నఁడో.

మ. అఖిలోర్వీజనపాలనప్రజనితా
యాసంబు దీఱున్ భవ
న్ముఖరాకాశశిహాసచంద్రికలఁ గ
న్గొన్నంతనే నాదు మున్

సఖ! నేఁ డేమొకొ నీమొగంబు గనఁ జిం
తం గుందు నాయాత్మకున్
సుఖమే దుఃఖముగాఁగఁ దోఁచుచుఁ గటా!
శోకాబ్ధి యుప్పొంగెడున్. 35

సీ. కళుకువాలుఁగసోఁగకకవ వ్రాలె వెడ వ్రాలి,
కడు సోలునిడువాలుఁ గనులతోడఁ
జెక్కినదంతంపుఁ జెక్కులవలెఁ దెల్పు,
చాయ లీనెడుచెక్కుదోయితోడఁ
బెన్నిధిం బొడగన్న పేదకైవడిఁ గడుం,
గడు నుబ్బుమీఱు నెన్నడుముతోడ
గాలి కూఁగెడుతీవగతి మేను దూఁగాడఁ,
దడఁబాటు గొల్పు నెన్నడలతోడ

తే. నిండుచూలాలవై యుండ నిన్నుఁ గనుల,
పండువుగఁ జూచు టెంక నెన్నండు గలుగు
నో యని యెడంద నువ్విళులూరుచుందు,
శ్రీపతికి లేదు దయ యేమి సేయవచ్చు. 36

శా. అన్నన్నా! తనదక్షిణాక్షికుల మి
ట్లంతంబు నొందింప నీ
కొన్నాఁడే నెఱనమ్మి తన్గొలుచుభ
క్తున్ నన్నుపేక్షింపుచుం
బున్నామం బగుదుర్గతిం జొరఁబడం
బోఁ జూచుచున్నాఁడె శ్రీ
మన్నారాయణుఁ డింక దిక్కెవరు భా
మా! యీనెగుల్ వాపఁగన్. 37

క. ఏదోసము నేఁ జేసితి,
నో దేవి! యెఱుంగ నది కా లోద్ధారకుఁ డై
మేదినిఁగా చెడుపుత్త్రుని,
ప్రాదుర్భావమున కడ్డపాటు ఘటించెన్.
క. అని చింతామగ్నుం డగు,
తనవిభుపల్కులను విని సుదక్షిణ వినతా
నన యై బాష్పజలమ్ములు,
గనుదమ్ములఁ గ్రమ్మ దీనగతి నిట్లనియెన్.
ఉ. ఈవెత నామతిం గలఁచు
నెప్పుడు నైనను నేమి సేయుదున్
నావిధి నావిధిన్ మనము
నం గడు దూఱుదుఁ గాక సర్వలో
కావళిఁ గన్నతండ్రి మన
కాత్మజు నొక్కని నీయకున్నె యే
లా వగ పంచు సారె హృద
యమ్మున కూఱట గొల్పుచుందుదున్
క. ఎన్నో నోములు నోఁచియు,
నెన్నో పున్నెము లొనర్చి యెంత గొలిచినన్
వెన్నుఁడు కృప దొఱఁగి మనలఁ,
గన్నెడ సేయుటకు నేమి కారణమొ కదా.
సీ. తఱి దప్పకుండంగ ధర్మార్థకామముల్,
విధ్యుక్తసరణి సేవించినారు
యజ్ఞాదిబహుసత్క్రియాకలాపముల మా,
ధవముఖామరకోటిఁ దనిపినారు

విలసదారామవాపీకూపసంతతుల్,
పృథివి నెల్లెడలఁ గల్పించినారు
గోభూహిరణ్యవాసోభోజనాదుల,
38 ద్విజకోటిఁ దృప్తిఁ బొందించినారు
తే. దుష్టదండనమును శిష్టతోషణంబుఁ,
జేయుచును బ్రజ వొగడ నశేషధరణి
ధర్మమార్గం బొకింతయుఁ దప్పకుండ,
39 నేలుమీ కేల సంతాన మీఁడొ శౌరి.
శా. దోసం బుండునె నాథ! మీవలన నెం
దు న్నాదుప్రాగ్జన్మపుం
దోసంబుల్ మము నిట్టినెవ్వగకుఁ బా
త్రుం జేసెఁ గాఁబోలు న
య్యో! సంసారలతాఫలంబుఁ గన లే
దో భాగ్య మీపుటునన్
నాసంతాపము డిందఁగాఁ గడుపు పం
40 డన్ నోఁచన్నైతిం గటా!. 43
తే. నుతతనూభవప్రాప్తికి నోఁచనట్టి,
పరమనిర్భాగ్యురాలిఁ జేపట్టుకతన
నిట్టినెవ్వగ గలిగెఁ బ్రాణేశ! మీకు,
41 నేమి సేయుదు నిఁక దీని కేది తెరువు. 44
మ. ఇది యేదోసముచేతఁ గల్గెనొకొ యం
చేలా మదిం గుంద నో
హృదయాధీశ! త్రికాలవేది శ్రుతపా
రీణుండు బ్రహ్మజ్ఞ తా

స్పదుఁ డబ్జాసనసూతి భాస్కరకులా
చార్యుండు సర్వజ్ఞమా
ళి దయాశాలి వసిష్ఠమౌని మనకున్
లేఁడా శుభావాప్తికిన్.

చ. హితమును మున్న తెల్పి మన
కెప్పుడు భద్రము గూర్చుటం బురో
హితుఁ డనుసార్థకాఖ్య వహి
యించినవాఁ డతఁ డమ్మహర్షి కూ
ర్జితమతి కీవితం బెఱుఁగఁ
జెప్ప నపుత్త్రితఁ గూర్చునట్టిదు
ష్కృతికిని నిష్కృతిం దెలియఁ
జేసి నిజేప్సితమున్ ఘటింపఁడే.

మ. అనుడుం బట్టపుదేవి పల్కులు మహో
ల్లాసంబు పుట్టింప స
జ్జనపాలుం డనె లెస్స యా నతివ! మె
చ్చన్ వచ్చు నీబోధముల్
మనకుం బ్రాంగణకామధేను వగున
వ్వాసిష్ఠుఁ డుండంగ ని
ట్లనుకో నేల సుప్రేయసిం బలికె గా
ఢాశ్లేషపూర్వంబుగన్.

తే. తరుణి! నీయిచ్ఛానఘరామృతమ్ముకంటె,
నీపలుకుఁ దేనె గనుఁ దృప్తి నించు నాకు
ననుచుఁ జెలిచెక్కు ముద్దాడి యధిపుఁ డపుడు,
గురువరాశ్రమగమనోత్సాహపరతఁ బరఁగె.

సీ. అతిదుర్వహంబైన యఖిలభూభారంబు
నిజమంత్రివరులపై నెలవుకొలిపి
భక్తకాముఁడైన పద్మామనోనాథుఁ
బొందమ్మివిరులతోఁ బూజచేసి
యవనీసురులు "సుపుత్రావాప్తిర" స్తంచు
నెలమి నిచ్చెడుదీవెనల గ్రహించి
గురునాశ్రమము బాధ వారయ కుండుత మంచుఁ
గొలఁదిసేవకుల రా సెల వొసంగి
తే. కులసముద్ధారకుం డైన కొడుకుఁగుఱ్ఱ
గలుగకుంటకు హేతువు దెలియ నెంచి
యాత్మసతియుఁ దానును నొక్క యరద మెక్కి
వెడలె గురునాశ్రమమున కవ్విభుఁడు పిదప. 49
తే. ప్రార్థనార్థసిద్ధి నెఱుంగఁ బఱచు చపుడు
గాలి యనుకూలగతి వీచు కతనఁ జేసి
యతివకురులకుఁ బతిపాగ కంటదయ్యె
హయఖురాహతులను రేఁగి నట్టిధూళి. 50
శా. త్రోవన్ మేఘనినాదమంద్రరథని
ర్ఘోషంబు లాలించి మో
దావేశంబున నజ్జు లెత్తి విమలా
పాంగప్రభల్ చంద్రికా
ధావళ్యంబు హసింపఁ గూయుశిఖిసం
తానంబు షడ్జస్వరా
రావంబుల్ విను చాసతీపతులు హ
ర్షం బొంది రందందులన్. 51

చ. కోలఁకులఁ గమ్మదమ్ములఁ ద
గుల్కొని తేనెలఁ జూఱలాడుచుం
జెలఁగెడు తేంట్లఱెక్కలను
జిందినపుష్పాడి మోచి పెక్కుపూ
గోలలఁ దనర్చు మంజులని
కుంజములందును విశ్రమించు చి
మ్మల నరుదెంచి యమ్మిథున
ముం గొలిచెన్ వలిపిల్లగాడుపుల్. 52

సీ. దరి నిల్చి తేరిపై పఱియు లేటికవలం
దనన్యోన్యనేత్రసౌఖ్యంబు గనుచు
బారులై యుత్తంభతోరణమాలల
ట్లలరి కూసెడుబెగ్గురులను గనుచుఁ
దమయిచ్చున గ్రహారములందు యజ్వ లి
చ్చినయర్ఘ్యములను దీవనలఁ గొనుచు
సద్యోఘృతము గొంచుఁ జనుదెంచుగొల్లము
సల్లఁ జెరువుచెట్లపే ళ్లడుగుచు

తే. దారిఁ బయనంబు సలుపు నాదంపతులకు
మంచుకాలము దగ గతియించినంత
నొకటఁ గూడుచిత్రాచంద్రులకును బోలె
నింతయుం దనరానిచె వ్యాసక మొసఁగె. 53

శా. ఆయావింతల నెల్ల జాయకుఁ బ్రియం
బారంగఁ జూపించు చా
రాయం డయ్యెడ దాఁటినట్టినిజమా
ర్గం బాత్మ గుర్తింప లే

కాయాసంబున నుర్వ్యగ్రక్కు పటుర
థ్యశ్రేణితోఁ బ్రీతితో
సాయంకాలము చేరెఁ దన్మునికులే
శానాశ్రమస్థానమున్. 54

సీ. కనరాక శిఖు లెదుర్కొన నొండువనినుండి
కుశలుఁ బండ్లును దెచ్చికొనెడుఋషులు
మునిపత్నులయపత్యములు వ్రాలె వాకిళ్ల
నివరివంతులకునై నిలుచు లేళ్లు
నీర్వోసి మునులకన్నెలు దవ్వ సనఁగ నా
తరులపాదులనీళ్లు ద్రాగుపక్షు
లెండ వ్రో నివ్వరి యెత్త ముంగిళ్లఁ గూ
ర్చుండి నెమరువేయుచుండుదుప్పు

తే. లాహుతిసుగంధయుతమునై యాశ్రమోన్ము
ఖాతిథులఁ బవిత్రులఁ జేయునట్టి పొగలు
గలిగి యయ్యాశ్రమనిశాంతవిలసనమ్ము
లధిపుడెందమానందమయముగఁ జేసె. 55

చ. హయముల సేవదేర్ప ముని
యంతన యాతను బంచి తేరినుం
డి యబల డించి తాఁ బిదప
డిగ్గి తదాశ్రమవాటి కేఁగ నా
యయమహితుర్కు సతీయుతు ధ
రావనదీక్షితుఁ జేరి మానిసం
చయము సమంచితార్చనలు
సల్పె నతిప్రియపూర్వకంబుగన్.

క. సాయంవిధితుద నమ్మహి
నాయకుఁడును నాసుదక్షిణయు మ్రొక్కిరి ప
త్నీయుతుఁ డగుగురునకు స్వా
హాయుక్తుం డైనయట్టి యనలునకుబలెన్. 57

తే. కడుపు చల్లఁగఁ గొడుకును గాంచు మంచు
"నచిరమేవ సుపుత్త్రాప్తిర" స్తటంచు
దీవనల నొసంగి రరుంధతీవసిష్ఠు
లెలమి మ్రొక్కెడునాదంపతులకు నపుడు. 58

ఉ. ప్రశ్రయ మాననాబ్జమునఁ
బైకొనఁగా నతిథిప్రపూజచే
నశ్రముఁ డై సుఖమ్ముగఁ గు
శాస్తరణమ్మునఁ గూరుచున్న రా
జ్యాశ్రమమౌనితోడ నపు
డమ్ముని రాజ్యమునందు సేమమే
విశ్రుతశీల యన్నఁ బృథి
వీపతి యాగ్గురుతోడ ని ట్లనున్. 59

క. సేమము సప్తాంగములకు
సేమము భూప్రజల కెల్ల సేమము మాకున్
నీమఱుఁగు సొచ్చి యుండఁగ
సేమంబులు మాకు బ్రాఁతె చెపుము మహాత్మా. 60

సీ. దైవమానుషములై తగులుకీడుల నెల్లఁ
దగుప్రతిక్రియలచేఁ దలఁగఁ జేసి
యతులమంత్రములచే నరుల దవ్వులఁ గూర్చి
యుద్ధంపుఁబని గల్గకుండఁ జేసి

విధియుక్తముగఁ జేయు వేల్మిచే వఱపున
వాడినచేలకు వాన లొసఁగి
సన్నుతబ్రహ్మవర్చసముచే సుఖవృత్తిఁ
బ్రజలకు నూఱేండ్ల బ్రదు కొసంగి
తే. కంటకివి తెప్పవలె నీవు గాచుచుండి
యనఘ నారాజ్యమున సేమ మడుగ నేల
యఖిలవిధముల నిట్లు నీ వరయ నాదు
సంపదల కెట్లు లాపదల్ సంభవించు. 61
తే. అఖిలజగముల సృజియించు నట్టిప్రోడ
నీదుతండ్రి చిన్మయమహానీయుఁ డట్టి
బ్రహ్మకొడుకవు నీవు మా పట్లఁ గలుగ
నేమిటను నైనఁ గొఱంత మా కేల కలుగు. 62
క. కాని యిది యొకటి మదికి న
నూనవిషాదంబు గొలుపు చుండుఁ గటకటా
యీనీకోడలికడుపున
సూనుఁ డొదవు టింకఁ గనులఁ జూడఁగ లేమిన్. 63
తే. అతులరత్నోత్కరము నను నట్టి దయ్యు
జలధిమేఖల సంప్రీతి గొలుపదయ్యె
సుగుణవతి యీయతివగర్భ శుక్తియందుఁ
దనయరత్నోదయము గల్గ కునికిఁ జేసి. 64
క. పిండము మదనంతర మిఁకఁ
నుండ దని స్వధైకసంగ్రహోత్సుకమతులై
యుండుట శ్రాద్ధసమునఁ గుడుపు
నిండఁ దనరు పితరు లింత నిక్కువము గదా. 65

తే. వీనితో నీక సరి గదా యీనివాప
వారి యని నాదుపితరులు సారె కొదవు
వేఁడినిట్టూర్పులను నులివెచ్చ నైన
నాజలాంజలిఁ గ్రోలుచున్నారు గాదె. 66

ఉ. దానములం దపంబులను
దార్కొనుపుణ్యము మీఁదఁ గాని సౌ
ఖ్యానుభవం బొసంగ దమ
లాన్వయమందును గల్గినట్టి సం
తాన మదిందు నందును ను
దంచితసౌఖ్యములన్ ఘటించెడుం
గాన మునీంద్ర యిక్కొఱఁత
గాటపువేదన గూర్చు నెప్పుడున్. 67

ఆ. ప్రేమఁ దాన పెంపఁ బెరిఁగి గొడ్డైనయా
శ్రమపువృక్షపోతకమును బోలె
సుతులు లేనినన్నుఁ జూచుచుండియు నెట్టు
లీవు వగవ కుంటివౌ విధాత. 68

ఉ. నాతొలుబామునందును నొ
నర్చినదోసమొ నేఁడు సేయుకీ
డో తనయోపలబ్ధికి న
యోగ్యునిఁ జేయఁగఁ బోలు నన్నయో
యీతుదియప్పుబాధ మఱి
యే నిఁక నెట్లును సైఁపఁ జాలఁ దం
డ్రీ తగ దీని నీఁగుటకు
నెద్ది యుపాయమొ యాన తీయవే. 69

క. ఏకోల యీకోల లేనివ్యా
ధాకలనకు హేతు వయ్యె నది వాపవె యై
క్ష్వాకులదురవాపార్థము
లోకోర్కులసిద్ధి నీకు నగ్గంబు గదా. 70

క. అని ఱేఁడు విన్నవింపఁగ
విని యమ్ముని యోగదృష్టి వీక్షించి మహీ
శునితో ని ట్లని చెప్పెం
దనుజన్ములు గలుగమికిని దగుకారణమున్. 71

ఉ. భూతలనాథ మున్ను మఘ
వుం గని భూమికి నీవు క్రమ్మఱన్
నీ తెరువందుఁ గల్పకము
నీడను స్వర్గవి యుండఁగా ఋతు
స్నాతను నీదుపత్నిని స
నాతనధర్మవిలోపభీతిచేఁ
జేతమునం దలంచుటను
జేయవ తత్సురభిప్రపూజలన్. 72

ఉ. నాపయి గుర్తు లేక చని
నాఁడవు నాసుతఁ గొల్చునంతకుం
బాపలఁ గాన కుండుము నృ
పా యని యయ్యది నిన్ శపించె నా
శాపము నీవు గాని రథ
సారథి గాని వినంగ లేదు ది
వ్యాపగఁ గేళిఁ దేలెడుమ
దాంధహరిత్కరిబృంహితంబుచేన్. 73

క. రాజ తదవజ్ఞచేతఁ ద
నూజుఁడు నీ కొదవఁ డయ్యెను జుమీ యది యోఁ
బూజింపఁ దగినవారలఁ
బూజింపక యునికి శ్రేయమున కడ్డు గదా. 74

చ. అనయము వారిధీశుమఖ
మందును హవ్యము గూర్ప మారుతా
శనవినిరోధదుర్గమర
సాతలమం దది యున్న దిప్డు త
త్తనుభవ యైననందినిని
దానికి మాఱుగఁ గొల్వు పత్నితో
గొనములఁ బ్రీత యైన నది
కోరినకోర్కులఁ దీర్చెడుం జుమీ. 75

ఆ. అనుచుఁ బల్కుచుండఁగ హోత యగునత్త
పోధనాఢ్యుహవ్యసాధనంబు
నందిని యనునట్టి నామంబునఁ దనర్చు
ధేను వడవినుండి తిరిగి వచ్చె. 76

సీ. చివురుజొంపమువోలె మివులఁ బాటల మైన
కాయంబు సంజకెంజాయ లీన
నొసటిపైఁ గరము సొంపెసఁగు తెల్లనిమచ్చ
లేఁతజాబిలిరేక లీలఁ బనర
దూడఁ జూడఁగఁ జేఁపి యొడికలై పాలు
తనివెచ్చఁ బాలచే ధరణి దడియ
నిజఖురోద్ధతధూళి నృపుమేను దోఁగి తీ
ర్థమ్ము లాడినపవిత్రత వహింప

తే. బలుపు మించుమేనును గుండ వంటిపొదుఁగు
మందగతులకు నొకవింత యంద మొసఁగ
నచటి కరుదెంచుచున్న య య్యావుఁ జూచి
శకునవిదుఁ డైనఋషి నృపాలకున కనియె. 77

తే. ధరణినాథ యీకల్యాణి తనదు పేరు
పేర్కొనుచుండఁగనె వచ్చి చేరెఁ గాన
భవదభీష్టము వేగ సాఫల్య మొందు
నింతయును నిక్కమం బని యెఱుఁగు మీవు. 78

క. అనయము ఫలమూలాదిక
మును దిను చాత్మానుగమనమునఁ దగ నీవం
దినిని బ్రసన్నం జేయుము
జనవర యలవాటుచేతఁ జదువుంబోలెన్. 79

ఆ. వెలల వెడలి నిలువ నిలిచి కూర్చుండఁ గూ
ర్చుండి యుదక మాన నుదక మాని
యెట్లు లిది మెలంగు నీ వట్ల మెలఁగు చీ
సౌరభేయిసేవ సలుపు మధిప. 80

క. ఊఱ వైనబత్తిఁ బూజలు
నెఱపి తపోవనమునను నీసతి దీనిన్
వఱువాత ననిచి రావలె
మఱియు నెదుర్కొనఁగవలయు మాపటివేళన్. 81

తే. ఇట్లు లీనందిని యనుగ్రహించుదనుక
నియతిఁ బరిచర్య సేయుము నృపవరేణ్య
నీకు విఘ్నముల్ రాకుండుఁగాక యిందు
దండ్రివలె నీవు సుతవద్వంతుఁ డగుము. 82

తే. అనుడు నట్ల చేయుదు మని యవ్విభుండు
నాతియుం దాను గురునియానతి గ్రహించె
రేయి యగుడుఁ బదంపడి ఋషివరుండు
భూవరోత్తము నిద్దురఁ బ్రోవఁ బనిచె.

చ. తనదుతపోమహత్త్వమున
ధారుణినాయకభోగయోగ్య మా
ఘనతరవస్తుజాలమును
గల్పన సేయఁగఁ జాలి యుండియుఁ
మునిపతి కందమూలఫల
ముల్ నవదర్భసముత్కరంబు భో
జనశయనార్థ మై పతి కొ
సంగె వ్రతాచరణోచితమ్ముగన్.

ఆ. అట గురుండు సూపు ననుటజమం దువిదతో
నృపతి నియతి నాఁటి రేయి గడపి
వేఁగ మౌనిశిష్యవేదపాఠరవంబు
లాలకించి వేగ మేలు కాంచె.

క. ప్రథితరఘూదయమున నిది
ప్రథమాశ్వాసంబు దీని గ్రహియింపుము ని
ర్మథితదశాననకుల నిజ
కథాకథనపావితాదికవివాక్కుసుమా.

శ్రీ

రామచంద్రపరబ్రహ్మణే నమః

# రఘూదయము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీమదినవంశకలశాబ్ధిసోమ రామ
యంబుదశ్యామ రణభీమ యవధరింపు
నీనవమిపూజకుం బుష్ప మైనయీర
ఘూదయమునందు నవల నింకఁ బొందుకథను. 1

మ. తరువాతన్ వఱువాత నాత్మసతిచే
తన్ గంధమాల్యాదిస
త్కరణం బాసురభిప్రసూతికిని మో
దం బారఁ జేయించి య
ద్దొర దూడం గుడిపించి కట్టి ధనువుం
దూణీరముం బూని స
త్వర మయ్యావును మేఁతకై విడిచెఁ గాం
తారాంతరక్షోణికిన్. 2

తే. ఆశ్రమాంతమువఱకు సకేయ్యావు ననుపు
తనసతిని దన్ను వెనుకొన్నకేఁయనుచరులను
మరలిచి యొకండ గోవృతో సరిగ జేఁడు
సవితృవంశ్యుల కొక్కరికిసాయ మేల. 3

క. వారిధులు నాల్గు సిరముల
పేరన్ వహియించి మహిమ పేర్మిఁ దనంతన్
గోరూపము ధరియించిన
ధారుణిబలె భూవిభుండు దానిం గాచెన్.

సీ. కన్నులేఁబచ్చ గడ్డిపోఁచలఁ బట్టఁ
జేసి నోటికిని సందిచ్చి యిచ్చి
దురదచే నెమ్మేను గరుపాఱునపు డెల్లఁ
గొనగోళ్ల నల్లన గోఁకిగోఁకి
వనదంశచయము జున్ముని మీఁద మూఁగుచోఁ
జేలాంచలమునఁ బోఁదోలితోలి
యిచ్చ వచ్చినయట్లు లెంచేని నజ లేక
విహరించుటకును బో విడిచివిడిచి

ఆ. వెలల వెడలి నిలువ నిలిచి కూర్చుండఁ గూ
ర్చుండి యుదక మాన నుదక మాని
నీడవ్రోలె జోడు వీడ కేఁగుచు ఱేఁడు
సౌరభేయిసేవ సలిపె నపుడు.

సీ. గొడుగు చామరలు వీడ్కొనిన రాజ్యశ్రీని
సహజతేజోవిశేషంబు దెలుపఁ
దీవకొనలఁ గూడఁదీసి కట్టినసిగ
హరినీలముకుటంబు ననుకరింప
నిరుగెలంకుల క్రొవ్వారు లరుదారఁ బక్షిగా
నములచే జయజయధ్వనులు సలుప
లాజలఁ బౌరబాలలు సల్లునట్లు తీ
వెలు గాలి కూఁగి క్రొవ్విరులు గురియఁ

తే. గామధేనుసుతాభిరక్షామిషమున
దుష్టజంతుల శిక్షింపఁ దొడరినట్లు
యెక్కిడినవిల్లు గొని కాన నింత నంత
గోవువెనువెంటఁ దిరిగె ధాత్రీవిభుండు. 6

ఉ. ఉన్నతచాపధారి యయి
యున్నను డెందములందు శంక యు
త్పన్నము గాక యుండుట ని
తండు దయామయుఁ డం చెఱింగి ప్ర
క్క న్నిలుచుండి తద్రుచిర
కాయముఁ జూచుచు నంత లేసి క్రా
ల్గన్నులకల్కికి ఫలము
గాంచె వనీహరిణీకదంబముల్. 7

తే. అనిలపూరితరంధ్రంబులైనబొంగు
వెదురులరవంబు శ్రుతి గాఁగఁ బొదరుటిండ్ల
స్వానుశ మచ్చైస్స్వరంబునఁ బాడుచున్న
విపినదేవతావళిపాట వినియె ఱేఁడు. 8

సీ. శిలలరాయిడి జలజలవాఱు సెలయేళ్ల
తరఁగలం దూలుతుంపురులఁ దోఁగి
వలపుదేనియలఁ దేఁటులకు విందులు సేయు
నలుఁగొమ్మల నల్లనల్ల నూఁచి
నిండార విరిసినకొండమల్లియపూవు
గుత్తులనెత్తావిఁ గొల్లలాడి
గుట్టగుట్టలు వడ్డమెట్టదామరలపు
ప్పొడితిప్పలను దడంబడుచు సుడిసి

తే. చలువపన్నీటితుంపర ♦ సల్లినట్లు
విరులవీవనలను మెల్ల ♦ విసరినట్లు
గొడుగులేమిని గట్టెండ ♦ బడలి యున్న
భూపు సేవించె వనవాత ♦ పోతకములు. 9

శా. చల్లాఱెన్ వడిఁ గాఱుచి చ్చపుడు వ
ర్షప్రాప్తి లేకుండియుం
బె ల్లయ్యెన్ ఫలపుష్పవృద్ధి లతికో
ర్వీజమ్ములన్ మైత్రి సం
ధిల్లెన్ బల్లిద మల్పజాతువును బా
ధింపంగఁ బోదయ్యె భూ
భృల్లోకోత్తరుఁ డవ్విభుండు విపినో
ర్వీసీమఁ గా ల్వెట్టఁగన్. 10

క. మెడబంటికసవుబీడుల
మెడ దింపక పచ్చగడ్డి ♦ మేసి సిలలనీ
ర్లడుపారఁ గ్రోలి నందిని
నడి మగిడె దినాంతమున న్వసవత్సదిదృక్షన్. 11

చ. అరుణము లైన క్రొందలిరు
టాకులచాయల నుల్లసిల్లునా
సురభితనూజయున్ జరత
సూర్యునికాంతియు నాశ లాత్మసం
చరణపవిత్రితమ్ములుగఁ
జల్వి తగన్ నిలయంబు నొందఁగా
దొరఁకొనియెన్ సరోజముల
తో మునిరాట్కరముల్ ముడుంగఁగన్. 12

సీ. పడియలనుండి వెల్వడి యసల్నై జాఱి
మందమందలు వాఱు పందిగములు
పఱపుఁ బచ్చనిపట్టుపఱపుల ట్లలరారు
పచ్చికపట్లపైఁ బండు లేళ్లు
నిదురప ట్లగుచెట్ల కెదురుగా మెడ లెత్తి
యెగుర నుంకింపఁ బోయెడు నెమిళ్లు
వెంటులతోఁ గూడి జంట లై తమతమ
చెట్లతోఁట్లల కేఁగుచిల్కపదువు
తే. లందు నందును గన్నులవిందు సలుప
నాదినాంతవనీలక్ష్మి నరసికొనుచు
నధిపుఁ డపుడు వెన్కఁబఁగ నయ్యావు వోలిచె
సద్విధిని గూడుకొన్నట్టిశ్రద్ధ వోలె. 13
తే. తనువు పెంపునఁ బొదుఁగుబర్వునను నొదవు
లలితగతులచేఁ జాల నలంకరించి
రాశ్రమమునకుఁ గ్రమ్మఱ సట్టిదారి
క్షోణివిభుఁడును నత్తొలుచూలియావు. 14
క. అపుడు సురభిసుత వెనుకొని
విపినస్థలినుండి వచ్చు విభుఁ గ్రోలెను ద
చ్చపలాక్షి తెప్ప వేయక
యుపవాసము చేసినట్టు లున్నకనుఁగవన్. 15
క. తెరువునఁ బతి వెనుకొనఁ ద
త్తరుణీమణి యెదురుకొనఁగఁ దా నడుమను ని
ర్జరధేనుతనయ దినశ
ర్వరులనడుమ నున్నసంజ వడువున నొప్పెన్. 16

ఉ. అక్షతపాత్రముం దనదు
హస్తమునన్ ధరియించి సత్క్రియా
దక్ష సుదక్షిణాసతి ప్ర
దక్షిణపూర్వముగాఁగఁ దత్పదా
గ్రక్షితి మ్రొక్కి పెన్నెరివి
గల్గినకొమ్ములనందు సత్సుతా
పేక్షను బూజచేసెను ని
జేప్సితసిద్ధికి మార్గముం బలెన్. 17

ఉ. దూడకుఁ బాలొసంగుతమి
తోఁ జనుచుండియు నెమ్మి నిల్చి య
ల్లాడక పూజ గైకొనియె
నంచును నెమ్మది నవ్విభుండు నా
చేడియయుం బ్రమోదమును
జెందిరి భక్తులకోర్కి వేగ చే
కూడుటకున్ నిదర్శనము
గుం గద తాదృగనుగ్రహాంకముల్. 18

చ. పిదప సభార్యుఁ డామునికిఁ
బ్రీతి నమస్కృతు లాచరించి యా
సదమలశీలశాలి నిజ
సాంధ్యవిధానము లెల్లఁ దీర్చి పా
ల్పిదికినపిమ్మటం దనదు
ప్రేయసి వీడక తోడ నుండ న
మ్మొదవునె కొల్చెఁ గ్రమ్మఱ న
ముత్కటభక్తిరసార్ద్రచిత్తుఁ డై. 19

క. చేడువనె దివ్వెయును నుప
హారంబులు నుంచి చేడికయుయుఁ దాను నిలా
దారుఁడు నందిని కూరుకఁ
గూరికె వఱువాత మేలుకొన మేల్కాంచియెన్. 20

క. ఇరువదియు నొక్కనాఁ డిటు
లరుదార సుదక్షిణాసమన్వితుఁ డై య
ద్దొర గోసేవా వ్రతమును
జరపెఁ సుతుఁ గోరి నియతశౌచవ్యాపరుఁ డై. 21

ఉ. అమ్మఱునాఁడు ఱేఁడు ప్రియ
మారఁగ నెప్పటియట్ల కాననాం
తమ్మున కాపుతోఁ జనఁగ
నందిని నాఁడు తదీయభక్తిభా
వమ్మెఱుఁగం దలంచి మును
వాఁక దొలంగెడుచోటికిన్ సమీ
పమ్మున లేఁతగడ్డి గల
పర్వతరాడ్గుహఁ జొచ్చెఁ జెచ్చెరన్. 22

ఉ. ఉత్తముఁ డౌ భగీరథుస
ముజ్జ్వలపాండురకీర్తిపూరము
లొత్తగునత్తుషారగిరి
శృంగమునుండి మహారవంబుతో
నెత్తమునందు దివ్యతటి
నీలహరుల్ వడి క్రేళ్లు దాఁటుసాం
పత్తఱిఁ జిత్తముం దిగువ
నద్దెస ఱేఁడు దవిల్చెఁ జూడ్కులన్. 23

ఉ. కానఁ జరించుఘాతుకమృ
గమ్ములకుం దమమానసమ్ములం
దేనియు దీనిపట్ల నొక
యొగ్గుఁ దలంపఁగరా దటంచు లో
నూనిననమ్మికన్ శిఖరి
యొప్పిదముం గనుచున్న ధేనికిం
గానఁగ రానియ ట్లొకమృ
కమ్ములజేఁ డటఁ బట్టె నందినిన్.

శా. అంభా యంచుఁ దదార్తరావము గుహా
వ్యాసక్తమై దీర్ఘమై
జంభారిప్రతిమానుఁ డార్తపరిర
క్షాదీక్షితుం డైనయా
యంభోజాతహితాన్వయోత్తరుఁగిరిం
ద్రాసక్త మాచూడ్కి సం
రంభం బార మరల్చెఁ బగ్గములఁ జే
రన్ లాగుచందమ్మునన్.

ఉ. వీనులఁ జూఁడునమ్మొఱను
విన్నతఁ డంబ తెలిలుసన్ మహీ
జానివతంసుఁ డమ్మొదవు
చక్కటిఁ స్కన్ నిగుడ్చు నక్షిసా
ధేనువుమీఁదఁ గన్పడియెఁ
దెల్లనిసింగము ధాటిం క్రమఁ
బూనినకొండ నెత్తముపఁ
బూచినలొద్దుగు దెల్పుకెంజిగిన్.

శా. ప్రత్యంగంబు వశంబు దప్పి జడతం
బ్రాపించె నారా యటం
చత్యాశ్చర్యము నొందుచేనికి మను
ష్యాభాషణోద్దండపాం
డిత్యప్రౌఢి మఱెంత యబ్బుర మెదన్
నింపంగ నాసింగ మా
ఢత్యస్ఫూర్తి దలిర్ప నమ్మునకులో
త్తంసంబుతో ని ట్లనున్. 30

ఉ. చాలు శ్రమంబు నీకు నృప
సత్తమ భావనిరోధ మయ్యె నం
చేల తపించె దె ట్లయిన
నేమియుఁ జేయఁగరాదు నన్ను నీ
కోలలు గీలలుం జెనకి
కూల్పఁగఁ జాలవు గాలి సాలముం
గూలుపఁ జాలుఁగాక వెను
గొండఁ గదల్పఁగ నైనఁ జాలునే. 31

క. భూనాథ నిను దిలీపుని
గా నే నెఱుఁగుదు నెఱుంగఁగాఁ దగు గౌరీ
జానిభటు నికుంభునిచెలి
కానిం గుంభోదరాఖ్యుఁగా నను నీవున్. 32

సీ. తా నిష్క్రియుం డయ్యు నే నానాజగత్సర్గ
పాలనాంతంబు లెవ్వాఁడు సలుపుఁ
దా దిగంబరుఁ డయ్యుఁ నే దనభక్తజనుల క
వ్వారిగా సిరుల నెవ్వాఁ డొసంగుఁ

దా సర్వగతుఁ డయ్యుఁ గ దానకంబుగ వెండి
కొండపై నెవ్వాఁడు గ కొల్వు సేయుఁ
దాఁ గామహరుఁ డయ్యు గ ధరణీధరేశపు
త్రికఁ గోర్కు లెవ్వాఁడు గ దీర్పఁ గడఁగు
తే. నట్టిసర్వేశ్వరుండు త్ర గయ్యంతసరణి
సంచరించెడుతనపాద గజలజ మంచి
నాదుచరమాంగమును బావ గనంబు సేయు
వృషభవాహంబుపై నెక్కు గవేళలందు. 33
క. ఇదె దేవదారువృక్షం
బెదురం గనుపట్టుఁ జూచి గతే నృప దీనిన్
మదనారి గిరిజ పెంచిన
దిది యని నిజపుత్త్రకునిగ గ నెదఁ బ్రేమించున్. 34
తే. భూరికుంభస్తనపయఃగప్ర గపూరములను
సారెసారెకుఁ ద్రావించి గ గౌరి దీనిఁ
బెరిమమైఁ గుమారునితోడ గ సరిగఁ బెనిచె
నీయగముభాగ్యమును నుతి గ సేయఁ దరమె. 35
మ. ఒకనాఁ డొక్కమదాంధసింధురము గం
డోద్భూతకండూతి కో
ర్వక యీచెట్టును రాయ నూడె వలపా
రఁ దీనిపై పట్ట దా
నికి నీహారధరాధిరాజసుత క
న్నీ రుట్ట శోకించె న్కం
దకుమారుం డసురాశుగక్షతులు వొం
దం గుందుచందంబునన్. 36

ఉ. ఆడిన మాదిగానె త్రిపు
రారి ననుం గరివైరిఁ జేసి కుం
భోదర యీహిమాద్రిగుహ
నుండి యిటుల్ దరిఁ జేరుజంతువుం
గా దన కారగించుచును
గావుము దీని న టంచుఁ బంచె దో
ర్మోదయితాకపోలముల
తో నెలనవ్వులు వియ్య మందఁగన్.

ఉ. ఆతరుణేందు శేఖరుని
యానతి నౌదలఁ బూని యున్నని
లాఁతి మొకమ్ములట్టులు ద
లంపఁగఁ బోకు నరేంద్ర నేను నీ
చేతిక కాదు దేవతల
చేతికి నైనను జిక్కఁబోను నా
వాతికి నబ్బుజంతువుల
ప్రాణముఁ గావఁగఁ జాలఁ డెవ్వఁడున్.

క. ఈశోణితపారణ నా
క్లేశుఁడు కరుణించె దీని కె నెవఁడును నుడుపం
గా శక్తుఁడు గాఁడు బుభు
క్షాశాంతికి నేఁటి కిదియ కె చాలున్ నాకున్.

ఉ. కావున నీకు లజ్జపడఁ
గాఁ బని లే దిఁక నింటి కేఁగు గో
త్రావర శంభుమాయ జవ
దాఁటఁగ నిది యేమి సేయ నా

భావము ముఖ్య మీవు గురు
భక్తిని జూపితి గాదె పాప మ
స్త్రావళిఁ గావరానియెడ
నస్త్రవిదుల్ గొఱగామి దోసమే. 40

ఆ. అని ప్రగల్భముగ మృగాధిరాజు వచింప
విని ధరాధిరాజు వింత మాని
హరునిమహిమచేత నస్త్రరోధం బౌటఁ
దనకుఁ బరిభవముగఁ దలఁపఁడయ్యె. 41

క. అదివఱ కెన్నఁడు నమ్మున
కెదు రెఱుఁగనియాతఁ డప్పు డిట్లని పలికెన్
మొదవుపయినుండి తనదగు
బదులుపలుకు నెదురు సూచు పంచాననమున్. 42

మ. మృగరాజోత్తమ నష్టచేష్టితుఁడ నా
నే నాడుప ల్కెట్టులున్
నగుఁబా టొందఁగఁ దగ్గ దింత నిజమై
నం బ్రాణిలోకంబునా
త్మగతిం బాతలఁ పీ వెఱుంగుదువు గా
దా నీకు దాపుండ ద
ట్లగుటం జెప్పెద నాలకింపు మటఁ జే
యన్ వచ్చు నీయిష్టమున్. 43

చ. కలితచరాచరాత్మకజ
గత్సృజనావననాశనక్రియల్
సలిపెడునాపరాత్పరుఁడు
శర్వుఁడు మాన్యుఁడ చూవె నాకు నీ

వల మహితాహితాగ్ని గురు
వర్యునియా వెదుటం గటా యిటుల్
పొలియుట సూచుచుణ మగిడి
పోవఁగఁ గా ల్లైయు లాడుఁ జెప్పుమా. 44

క. వే యేల నాయొడలిచే
నీయాఁకలి దీర్చికొని మునిప్రవరునిమా
హాయిని విడువుము దూడ య
యో యింతకు నెదురు సూచుచుండు జననికై. 45

తే. అనుడు దంష్ట్రారుచులఁ దద్గుహాంతమంబు
దవ్వు దూలఁగ నొకపెద్దనవ్వు నవ్వి
యాహిమాద్రిసుతామనోహరుని లెంక
యినకులునితోడ మగుడఁ దా నిట్టు లనియె. 46

క. ఏకచ్ఛత్రం బగుభూ
లోకప్రాభవము సొం పొలుకులేఁ బాయం
బీకనువిం దగు కాయము
పోకార్చెదె యకట స్వల్పమునకై యధిపా. 47

క. ఆకారముతీ రరయ వి
వేకివిగాఁ దోఁచె దెంత వెఱ్ఱి వయితి కా
ర్యాకార్యవిచారము వల
దే కటకట నిన్ను నింక నే మన నేర్తున్. 48

తే. భూతదయచేత నీచేతఁ బూని తేని
నీవు చదిసిన నీయొక్కయావె బ్రదుకు
నీవు బ్రదికినఁ బితవ్రోలె నెమ్మిఁ గావ
వేనవేల్ ప్రజలు బ్రదుకరే నరేంద్ర. 49

ఉ. పావక తేజుఁ డై నగురు
వర్యున కున్నది యా వి దొక్క టే
కావున నిన్ను నాతఁ డలు
కన్ శపియించు న టంచు జంకె దో
భూవర కుండవంటిపోదు
వుల్ గలయావులు కో ట్లొసంగి నీ
వావర యోగశాలి నెఱ
యల్కను జుల్కన పాప నోపవే. 50

తే. ఇంతకుఁ దెగింప నంత నీ కేమి వచ్చెఁ
జిల్లిగవ్వకై రతనంబుఁ జెఱుతురయ్య
రాజరా జేడ నిట్టివరాటి యేడ
వలవ దీప్రాన్కి బుద్ధిమంతులకుఁ దగదు. 51

చ. బలసము పేత మప్రతిమ
భ వ్యసుఖానుభవంబు లొందఁగాఁ
గలయది నీమనోజ్ఞ మగు
కాయము దీనిని గాచికొమ్ము భూ
తలమును జెంది యుండుటయ
తక్క మ ఱొండువిభేద మున్న దే
యలదివిజేంద్రలక్ష్మికి స
మగ్రమహీతలరాజ్యలక్ష్మికిన్. 52

ఆ. అని వచించి కుంజరారి యూరక యున్న
గవులఁ జెలఁగుమాఱురవళిచేత
గట్టుఱేఁడు గూడఁ గడుఁ బ్రీతి నృపతితో
నదియ పల్కుచున్నయట్లు తోఁచె. 53

తే. అధిపుఁ డపుడు సింగముపల్కు లాలకించి
కనుల నీ రొల్క మై గడగడవడంక
దీనదృష్టులఁ దనుఁ జూచు ధేనువందు
నెద గడుఁ గరంగి మగుడఁ దా నిట్టులనియె. 54

చ. శితిగళుబంటు వింత పరి
శీలన సేయకపోయి తయ్యయో
క్షతమును బాపి కాచు నని
కాదె జగంబుల రూఢి కెక్క నా
ర్జిత మగుక్షత్త్ర శబ్ద మటు
సేయక తద్విపరీతవృత్తి యా
పతికి విగర్హితమ్ము లగు
ప్రాణము లేటికి రాజ్య మేటికిన్. 55

ఉ. గోవులు కోట్లొసంగి గురు
కోపముఁ బాపఁగవచ్చు నంటి వా
డావులు కోటు లర్బుదము
లైనను దీనికి సాటి వచ్చునే
దైవతధేనుమాళి కిది
తక్కువ గా దని యెన్ను మీవు గా
రీవిభుశక్తి గా కిది హ
రీ యిటు వట్టఁగ నీకు శక్యమే. 56

ఉ. దీనికి మాఱు నాదయిన
దేహ మొసంగి మృగేంద్ర దీని నె
ట్లైనియు నిప్డు నీవలన
నే విడిపించుట పాడి సూవె య

స్త్రైనఁ ద్వాదీయపారణకు
నడ్డు ఘటిల్లక యుండు నామునీ
శానునిసత్క్రియార్థమును
సాగు సతంబు నిరంతరాయ మై. 57

ఉ. ఈవును నిర్విధం బెఱుఁగ
వే పరతంత్రుఁడ వౌదువే కదా
యీవనశాఖిఁ గాంచునెడ
నెంతో కడంక వహింతు గాదె తాఁ
గావఁగఁ దగ్గవస్తువును
గానక చా విడి యక్షతాంగుఁ డై
సేవకుఁ డెవ్వఁడేని ప్రభు
చెంగట నిల్వఁగలాఁడె చెప్పుమా. 58

శా. నీకు౯ నామెయి గావఁ దగ్గ దగునే
ని౯ నాయశఃకాయ మం
దీకారుణ్యము సూపు మయ్యదియ నా
కిష్టంబు సూవే మృగేం
ద్రా కాలం బరుదేరఁ దప్ప కిలపై
రాలంగ నున్నట్టిచో
క్కాకుల్ భౌతికమాంసపిండములకై
యాసింతురే మాదృశుల్. 59

తే. మాట లాడిన నోడఁగూడు౯ మైత్రి యందు
రది యొదవె నిందుఁ గూడుకో౯న్నట్టిమనకుఁ
గాన హరదాస చెలికాఁడ౯ నైనయట్టి
నాదువేఁడికో ల్గా దన౯రాదు సూవె. 60

చ. అన నవుఁగాక టంచును మృ
ధిపుఁ డావును వీడఁ దోఁడనే
తనభుజబంధముం దొఱఁగి
ధారుణినాయకుఁ డాయుధమ్ము లె
ల్లను విడనాడి సుంతయుఁ గ
లంగనిజెందముచొప్పు దెల్పి వా
యనిమొగమందుఁ జోఁప హరి
కర్ణణ చేసె స్వకీయకాయమున్.

ఉ. ఆధరణీశుఁ డిట్టులు ని
జాంగము మాంసపుఁగండవ్రోలె గం
గాధరులెంక కర్పితము
గా నొనరించి తదుగ్రపాత మొం
తో ధృతి మోము వాంచి కను
చుండఁగ నానరనాథుమీఁద వి
ద్యాధరపాణిసంకలిత
మై కురిసెన్ విరివాన జల్లునన్.

ఉ. అప్పుడు లెమ్ము వత్స యను
నట్టిసుధామయ మైనతియ్యఁబ
ల్కుప్పతి యాలకించి ప్రియ
మారఁగ డిగ్గన లేచి యయ్యెడన్
గుప్పునఁ బాలు చేఁపునల
గోవును దల్లినిబోలెఁ గన్గొనెం
దెప్పర మైనయామృగప
తిం గనఁడయ్యెఁ బురస్థలంబునన్.

ఉ. దానికి నబ్జ మందువదను
ధాపతితో నపు డిట్లు పల్కె నా
ధేనువు వత్స నీదగుమ
దిం గలభక్తి పరీక్ష సేయఁగా
నే నిటు మాయ పన్నితి ము
నీంద్రప్రభావముచే నమర్త్యజనుం
డైనను నొంపఁ జాలఁ డిఁక
సన్యశరారులఁ జెప్ప నేటికిన్. 64

తే. గురునియెడ భక్తి నాయందుఁ గరుణ యింత
గలవె యహహా వేఁడుము పుత్త్రకా వరంబు
నన్ను నొకపాఁడిపట్టిగా నెన్ని కన్న
ప్రీతిఁ బొందినఁ గోరుకోరికల నిత్తు. 65

క. అనవుడుఁ గులకర్త యయిన
తనయుఁడు తనదేవి యగుసుదక్షిణగర్భం
బునయందుఁ గలుగ వేఁడెఁ
జనపాలుఁడు గేలు మోడ్చి సవినయఫణితిన్. 66

ఆ. అట్లు కలుగుఁ గాక యని వేఁడుకోరిన
వర మొసంగి యపుడు సురభితనయ
పత్త్రపుటిని నాదుపాలు పిదికి పుత్త్రి
క్రోలు మంచు నవనిపాలుఁ బంచె. 67

తే. దూడ ద్రావఁగ హోమవిధులకుఁ గాఁగ
మిగులునీపాలు గురునిసేవలకును బొంది
క్రోలఁ దలఁచితిఁ దల్లి నేనేలుచున్న
నేలయందలి యమృతపాలుఁ బోలె. 68

తే. అని విభుఁడు విన్నవింప నక్కయ్యావు దాని
కాత్మ నెంతయు సంతసం బంది యపుడు
నరవరునితోడఁ దుహినాద్రికదరిని వీడి
యాశ్రమమునకు నేతెంచె నశ్రమమున. 69

చ. కలకలలాడుచుం గడువి
కాసముతోఁ జగదిందుసంపదం
గలకలనవ్వుచుండిన మొ
గమ్మునఁ గల్గుముదంకలక్ష్మిచేఁ
దెలుపకమున్న తోఁచునల
ధేనువు దైవయనుగ్రహంబుఁ బ
ల్కుల గురుతోడఁ జెప్పి ప్రియ
కుం దెలిపెం బునరుక్తమూఁ బలెన్. 70

ఉ. తత్సమయమ్మునన్ విమల
ధర్మపరాయణమానసుండు స
ద్వాత్సల్యుఁ డామహీపతియు
తంసుఁడు నాంత్యవిధుల్ ఘటించి త
ద్వాత్సల్యతావశేష మగు
పాలను బా గురుపత్న్యనుజ్ఞమైఁ
దత్పిలమూర్తకృత్రిబలెఁ
ద్రావెఁ [illegible]. 71

తే. తెలివాఱఁ [illegible]
[illegible]
తనగురుం [illegible]
[illegible]

గీ. అత్రిదృగ్జాత మగుజ్యోతి నమరసృతియు
నగ్నినిష్ఠ్యూతహార తేజ మమరనదియుఁ
బూనుకైవడి దిక్పాలకానుభావ
కలితగర్భంబుఁ బిదప మాగధి ధరించె. 75

క. ఈయది రఘూదయమున ద్వి
తీయాశ్వాసము గ్రహింపు దీనిని సీతా
నాయక భక్తశ్రేయో
దాయక మునివంద్య గిరిసుతావరనంద్యా. 76



శ్రీ

రామచంద్రపరబ్రహ్మణే నమః.

# రఘూదయము.

## తృతీయాశ్వాసము.



దయాపూర్ణభావ దేవాదిదేవ
శివవినుతనామ శ్రీరామ చిత్తగింపు
నీనవమిపూజకుం బుష్ప మైనయీర
ఘూదయమునందు నవల నింపొందుకథను. 1

సీ. తడవులఁ బట్టి సంతతి లేక వగచుచు
నానాథుఁడెందమ్ము లోనికోర్కె
యెపు డెప్పు డని కాన్పు నెదురు చూచుచునుండఁగఁ
జెలులకన్నులకు వెన్నెలలతేట
పావనేక్ష్వాకురాడ్వంశంబు తీఁగ సాఁ
గఁగఁ జేయుటకు నాదికారణంబు
కడుభక్తి గోసేవ గావించుటం జేసి
పొడమినసముదారపుణ్యఫలము

తే. తనదు వెం పంతకంతకుఁ బెనుపు నొంద
భూమహిళ యాచరించిన నోముపంట
యైనదౌహృదలక్షణం బూనె నపుడు
ప్రతనుశుభగాత్రి మగధభూపాలపుత్త్రి. 2

చ. చెలువగు మేను మిక్కిలిఁ గృ
శించుటఁ జేసి కొలంది భూషణ
మ్ములు ధరియించి లోధ్రసుమ
ముఁ బలెఁ బాలిన మోముతోడ నా
లలన గడున్ విరాజిలెఁ గొ
లందిగఁ జుక్కలు మిన్కుమిన్కనం
దెలతెలవేఁగుచోఁ బ్రతను
దీధితి యౌ నెలతోడి రేబలెన్.

ఆ. కడుపులోని కొడుకు × పుడమి ననుభవించు
నట్టి చక్రవర్తి × యగుటఁ జేసి
మంటికుడుపునంద × మన సుంచెఁ దొలుదొల్త
నన్యరసము లొల్ల × కావధూటి.

తే. మంటితావుల నీనున × మ్ముగువ మొగము
మూరుకొని తనివోఁ డయ్యె × భూరమణుఁడు
తొలకరి మొయిళ్లచినుకులఁ × దొప్పఁదోఁగు
నడవిపడియను మూర్కొన్న × హస్తివోలె.

తే. సిగ్గుచే నాకు నేకోర్కె × సెప్ప దబల
యేమి గోరెడుఁ గనుఁగొనుం × డీ రటంచు
నాదృతిని సారెసారెకు × నడుగుచుండు
నారసాపతి తనదు దే × వేరి చెలుల.

క. వేవిళ్లవలని వగపున
నా వెలఁదుక గోరుకోర్కె × లన్నియుఁ బొందెన్
భూవరుఁడు చాప మెక్కుడఁ
దే వలనుపడనిది లేదు × త్రిదివమునందున్.

తే. పడఁతి క్రమమున వేవిళ్లబాధ యుడిగి
కరము పుష్టి వహించునంగములతోడఁ
బండుటాకులు డుల్చి యాపైని గ్రొత్త
చివురు దొడిగినయెలదీఁగచెలువు దాల్చె. 8

చ. దినము లతిక్రమించుకొలఁ
దిం గడు బల్పు వహించి నల్లనౌ
మొనలఁ దనర్చునాభువన
మోహనశోభనగాత్రిచొక్కపుం
జనుఁగవ ధిక్కరించె విల
సన్మదషట్పదయుగ్మకంబు వా
సనకయి మీఁద వ్రాలఁగ నె
సంగుచొకాటపుఁదమ్మిమొగ్గలన్. 9

సీ. అంతర్నిగూఢాగ్ని యగుశమీలత వ్రోలె
నిధిగర్భ యగుసింధునేమి వ్రోలె
నంతస్సలిలపూర యగుసరస్వతి వ్రోలె
భావగర్భిత యైనవాక్కు వ్రోలె
నభిలీనమార్తండ యగుపూర్వదిశ వ్రోలె
మౌక్తికోదర యైనశుక్తి వ్రోలె
శశికుక్షి యగుక్షీరజలధివీచిక వ్రోలె
ర గర్భ యగుకావ్యరచన వ్రోలె

తే. నాతతార్థసమేత యానీతి వ్రోలె
సభువనోదర యగునాదిశక్తి వ్రోలెఁ
గకుబధీశాంశవినివిష్టగర్భ యైన
యానుదక్షిణ గనుపట్టె నధిపుమదికి. 10

చ. తన ప్రియురాలిమీఁద నెడఁ
దం గలప్రేమకు బాహుళ
గొనినదిగంతసంపదల
కుఁ హృదయోన్నతికిఁ సుతుండు గ
ల్గ ననెడుసంప్రమోదమున
కుం దగునట్లు యథాక్రమంబుగా
నొనరిచె నాయభిజ్ఞుఁడు స
ముజ్జ్వలపుంసవనాదిక క్రియల్. 11

సీ. చతురంతవసుమతీచక్రంబు నిర్వక్ర
విక్రమంబున నేల వెలఁది దలఁచు
సకలలోకంబును సంతృప్తిఁ బడయఁగా
సర్వస్వము నొసంగఁ జాన యెంచుఁ
గకుబధీశులచేతఁ గప్పముల్ గొని యర్థి
కామితంబులఁ దీర్ప లేమ వలచుఁ
గమనీయనిజకీర్తిగంగాలహరిచేతఁ
ద్రిభువనంబుల ముంపఁ దెఱవ గోరు

తే. దిగ్జయజితాఖిలక్షమాధీశముకుట
రత్నకాంతులు నిజపదాగ్రమునఁ బొలయఁ
బెద్దగద్దియఁ గొలు వుండఁ బ్రీతి నించు
భామ గర్భార్భకమహానుభావకలన. 12

క. చూలాలగు జవరాలికిఁ
గాలక్షేపంబు జరపఁగా నొక్కొకచోఁ
గేళిభవనమున గోష్ఠీ
లాలసుఁడై ప్రొద్దు లయ్యిలాపతి గడపున్. 13

చ. నరపతి యాత్మవాసభవ
నంబునకుం జనుదేర విస్ఫుర
ద్గురుతరగర్భభారమున
గొబ్బున గద్దియ డిగ్గలేక తాఁ
గరములు మోడ్చుచో నలఁత
గైకొని సంభ్రమమోదముల్ తటి
త్తరళతరాక్షులం దెలుపు
తన్విని జూచి విభుండు రంజిలున్. 14

తే. తనువు దూఁగాడఁ ద న్నెదుర్కొనెడునబల
కరముఁ గరమునఁ బట్టి యంకమునఁ జేర్చి
నిండుచందురుఁ బోలునకన్నెలఁతమోముఁ
గాంచి యుప్పొంగు సంద్రంబుకరణి ఱేఁడు. 15

ఉ. డాతొడపై వసించినప
డంతిని వామకరంబునం గడుం
బ్రీతిఁ గవుంగిలించి చెలి
పేరెద నట్టిటు వడ్డహారము
క్రాతరళంబు దిద్దుగతిఁ
దా వలకేలు పయంటఁ జొన్పి ల
జ్జాతరళేక్షణంబు లొల
యం దడవుం బతి నాతిగర్భమున్. 16

క. చేతోముద మొదవఁగ నిటు
భూతలవిభుఁ డప్పయోజముఖిగర్భంబుం
జేతం దడవుచును దనూ
జాతాంగస్పర్శనైకసౌఖ్యము నొందెన్. 17

మ. తెలినిగ్గుల్ వెదచల్లుచూపులకు నం
తేవాసు లై యొంతయుం
బలుకం బాఱిన చెక్కుటద్దములపైఁ
బాండుప్రభాంకూరముల్
వాలయం జేయుచు ముద్దుగుల్కుచిఱున
వ్వుల్ సూడఁగా సారెకున్
మెలఁతన్ మేలములన్ నగించు నలభూ
మీపాలకుం డాదటన్. 18

సీ. మునిమాపుతఱి వినూ । తనశోభ నలరారు
నజసూతిమునిసంకు । లాశ్రమంబు
గాఢసమాధిమైఁ । గన్నుదోయి మొగిడ్చి
యనపత్యతాహేతు । వరయుగురుని
నగరాజుతలనుండి । దిగఁబాఱుచదలేటి
కిరుగెలంకులఁ బెచ్చు । పెరుఁగువనుల
నాదినిపై వ్రాలి । కుందారుతనుఁ జూచి
సెలవివాఱఁగ నవ్వు । సింహరాజు

తే. మున్ను దారు గన్గొన్నయా । చెన్నొకింత
మైనఁ దప్పక తలఁపించు । నట్లు వ్రాసి
చిత్రపటముల దేవేరి । చేతి కిచ్చి
యబల యిది యేమి చెప్పెకొ । మ్మను విభుండు. 19

తే. ఇట్లు తనదేవి కుల్లాస । మెసక మెసఁగ
నహరహము ఱేఁడు సుఖగోష్ఠి । నంతిపురిని
బ్రొద్దు జరపఁ బ్రొద్దులు సొచ్చె । భూపుఁ డలర
మాగధికి నంతఁ బదియవ । మాసమందు. 20

క. ప్రసవోన్ముఖి యై తగుతన
బిసరుహముఖి నవనినేత । ప్రీతిం జూచెఁ
రసతుందిలజలదావృతి
లసిత యయి తనర్చుగగన । లక్ష్మిం బోలెన్. 21

ఉ. ఐదుగ్రహంబు లుచ్చగము
లై రవిఁ జేరఁగఁ బోక యున్కి భా
గ్యోదయసంపదం దెలుపు
చున్నసమున్నతలగ్నమందు నా
పై దలిమిన్న లేఁగొమరుఁ
బట్టిని గాంచెఁ ద్రిసాధనైకసం
పాదితశక్తి యుల్లసద
పారమహార్థము నీను కైవడిన్. 22

చ. దిశ లమలంబు లయ్యె వలి
తెమ్మెర లిమ్ముల నల్లనల్ల వీ
చె శిఖి ప్రదక్షిణార్చి యయి
చేకొనె నాహుతి నిట్లు సర్వముం
గుశలముఁ దెల్పుచుఁ జనుల
కుం బ్రమదావహ మయ్యె నప్డు తా
దృశులసముద్భవంబు జగ
తివితతాభ్యుదయార్థ మౌఁ గదా. 23

ఆ. పురుటియింటిపాను । పున నున్న రాపట్టి
యొడలికాంతు లోలయ । నడికి రేయి
దీపకళిక లెల్ల । దీప్తులఁ బెడఁబాసి
చిత్రవిలిఖితముల । చెలువు దాల్చె. 24

చ. వడిఁ బఱతెంచి కోర్కి దయి
వాఱ సుధాతులితాక్షరంబుగాఁ
గొడుకుదయించె నంచుఁ దన
కున్ వినిపించు ప్రియావయస్య కా
యొడయఁడు ప్రీతిమై నొసఁగ
కుండినవస్తులు మూఁడుమాత్రమే
యుడుపతితుల్యకాంతి యయి
యొప్పెడుఛత్రము రెండుచామరల్. 25

చ. అనిలము లేనిచోటఁ గద
లాడక యుండినతమ్మిపూలచె
న్నున నతినిశ్చలం బగుక
నుంగవతో సుతుమోముఁ గ్రోలునా
యనఘునసమ్మదమ్ము హృద
యమ్మునఁ బట్టక పైకిఁ బొంగె సో
ముని గనినంతనే పయిఁకిఁ
బొంగెడుసంద్రము వెల్లిపోలికన్. 26

తే. ఆశ్రమమునుండి వసిష్ఠుఁ డరుగుదెంచి
జాతకర్మము నెరప భూమినేతపట్టి
యాకరంబున నుద్భవం బంద తగిన
సానఁ దేఱినమణివోలెఁ జాల వెలిఁగె. 27

క. మంగళతూర్యరవంబు లె
సంగెన్ వారాంగనాలసన్నాట్యకళా
సంగతము లగుచు నృపభవ
నాంగణమునఁ గాక నింగియందుం గూడన్. 28

తే. కొడు కొదవె నన్నప్రీతిచే నిడుచుటకును
బద్ధుఁ డొకఁడును లేఁడయ్యెఁ బార్థివునకుఁ
దన్నుఁ దాన పితౄణబంధమ్మువలన
నానుపుత్త్రుఁడు విడఁదల చేసికొనియె. 29

క. లఘుగతిని శ్రుతాంతంబు రి
పుఘుటాంతము నొంద నేర్చుఁ బో వీఁ డని తా
లఘిధాత్వర్థము నారసి
రఘు వని కొడుకునకుఁ బేరు రాజపుఁ డిడియెన్. 30

చ. అసమమహామహీతలస
మగ్రరమావిభవాభిరాముఁ డై
యెసఁగెడుతండ్రిపూన్కి రఘు
వెంతయుఁ బెంచె శుభాంగకమ్ములన్
వసుపరిపూర్ణుఁ డై నయాల
వారిజమిత్త్రమయూఖమంజరీ
ప్రసరముచే నొడల్ వెనుచు
బాలశశాంకునియొప్పు చొప్పడన్. 31

చ. ఉమయు మహేశుఁడున్ శరస
ముద్భవుఁ గాంచి శచీపురందరుల్
కొమరు జయంతుఁ గాంచియు న
కుంఠితమోదము నెట్లు గాంతు రా
క్రమమునఁ దత్సమాను లనఁ
గాఁ దగునాసతియున్ విభుండు త
త్సముఁ డగుపుత్త్రుఁ గన్గొని ము
దమ్మునఁ బొంగుచునుండి రెప్పుడున్. 32

ఉ. జక్కవదోయి కెట్టటుల
స్వాంతనిబంధనమై కరంబు పెం
పెక్కినయట్టివారియిత
రేతరసంశ్రయమైనప్రేమ యా
యొక్కసుతుండు పంచికొని
యున్నను దగ్గక తొంటికంటెఁ దా
నిక్కట మయ్యె నాత్మజన
నీక్షణలాలనపాలనమ్ములన్.

సీ. తాత యవ్వ యటంచు దాదిమున్పలుకున
ప్పలుకు దప్పక పట్టిపట్టి పలుకు
దాదివ్రే లూఁతగాఁ దప్పటడుగు లిడు
చల్లనల్లన పజ్జ కరుగుదెంచు
నప్ప యెవ్వరు చెప్పు మనఁ గ్రన్నన తదాన
నంబుఁ గన్గొని లేఁతనవ్వు నవ్వు
నయ్య కిట్టులు మ్రొక్కు మని చూపఁ దనచిన్ని
కేలుదమ్ములు మోడ్చి వ్రాలి మ్రొక్కుఁ

తే. గలువఱేకులఁ బురుడించుకన్నుదోయి
పాలబుగ్గలు పలుమొగ్గచాలు వెడఁద
నుదురు నెఱిముంగురులు ముద్దుగదురఁ జేయు
నిట్లు బాలుఁడు తనతండ్రి నెలమిఁ దేల్చు.

ఉ. ఆసుతుఁ గ్రుచ్చి యెత్తి తన
యంకముఁ జేర్చి శరీరయోగజం
బౌసుఖసంపదల్ సలలి
తామృతధారలఁ దొప్పఁదోఁగిన

శ్రై సముపాంతముల్ మొగిడి
యతులు చొక్క నెఱింగె నానృపా
గ్రేసరుఁ డప్డు పెద్దవడి
కిం దనయాంగకసంగసౌఖ్యమున్. 35

తే. భూపతి గుణాగ్రవర్తి స్వకమూర్తిభేద
మయినసుతుచేఁ గులము నిల్చు ననని తలంచె
విధి గుణాగ్రవర్తి స్వమూర్తిభేద మగుర
మేశుచే సృష్టి నిల్చు నం చెంచునట్లు. 36

సీ. చౌలకర్మము దీఱఁ జలకాకపక్షు లా
తనయాడుమంత్రిపుత్త్రకులఁ గూడి
లిపిసంగ్రహణముచే లీల వాఙ్మయ మేటి
మొగమున మున్నీటిఁ బోలెఁ జొచ్చి
నిగమోక్తముగ నుపనీతుఁడై విబుధు లా
సద్గురువులశిక్షఁ జదువు గఱచి
పాత్త్రోపహితశిక్ష ఫలియించు ననుటకుఁ
దన నేరిమినె నిదర్శనము చేసి

తే. యమలమతి యారఘువు ధీగుణములచేత
నాల్గుసంద్రమ్ములం బోలునాల్గుకళలఁ
గ్రమమునఁ దరించెఁ బవనాతిగమ్ము లైన
గుఱ్ఱములచేతఁ దరణి దిక్కులనుబోలె. 37

తే. ఆరఘువు పూతరురుచర్మధారి యగుచుఁ
దండ్రివలననె యస్త్రవిద్యను గ్రహించె
నతనితండ్రి రాజత్వంబునంద కాక
యద్వితీయుఁడు విలువిద్యయందుఁ గూడ. 38

తే. గోపతిత్వ మొందుచున్నకోడె వ్రాలెఁ
గుంజరేంద్రత గాను నేన్గుగున్న వ్రాలె
వరుస బాల్యము డించి జవ్వనము నొంది
రఘువు గాంభీర్యచారుగాత్రమును బెనిచె.

సీ. ఆజానుపరిలంబి యై మలంచినయుగ
యుగముఁ బోలెడుబాహుయుగముతోడఁ
దళుకువజ్రాలపోఁగుల నంటికొనుచు మాం
సలము లై యొప్పునంసములతోడ
నీ లైనపసిఁడికవాటంబునకు సదృ
క్షం బైనవిపులవక్షంబుతోడఁ
బొడవు పొట్టియుఁ గాక కడు బల్పమై బంధు
రం బైనఘనకంధరంబుతోడ

తే. నురుకకీతటికిని వెల్పుటురమునకును
గడు మురువు నించుసింగంపునడుముతోడ
మించి మేని పెంపునఁ దండ్రి మించియును పి
నీతిసొంపున రఘువు కొండికిగఁ దోఁచె.

ఉ. ఆనిజపుత్త్రు నుల్లసిత
యౌవనసంపదఁ జూచి తండ్రి యా
సూనున కీడు జోడయిన
సుందరి నారసి తెచ్చి పెండ్లి గో
దానవిధానపూర్వముగఁ
దా నొనరించె మహీహిరణ్యగో
దానవిధానతృప్తవసు
ధాదివిజస్తుతు లుల్లసిల్లఁగన్.

తే. నృపతి పిదపఁ దాఁ జిరము ధరించినట్టి
బహుళభూభారమును జుల్కఁబఱుప నెంచి
యాతఁడు నిసర్గవిద్యావినీతుఁ డనుచు
రఘువునకుఁ బ్రాజ్య మగుయౌవరాజ్య మిచ్చె. 42

చ. ధరణిపుఁ డన్ప్రధానపుఁబ
దంబుదరిన్ యువరాజసంజ్ఞచేఁ
గర మలరారుతత్పదముఁ
గ్రక్కునఁ బొందె నిజాంశసంగతిన్
సిరి గుణవాసనానిరతి
చేఁ దనముఖ్యనివాస మైనయా
సరసిజమందునుండి విక
సత్కుముదంబును బొందు కైవడిన్. 43

ఉ. సారథి యైనయాపవను
సంగతి రాజిలునగ్నిచాడ్పునన్
శారదకాలసంగతి నె
సంగుపతంగుఁడు వ్రాలె నుల్లస
ద్భూరికటప్రభేదమునఁ
బొల్చుకరీంద్రముమాడ్కిఁ జేఁ దురు
శ్రీరమణీయుఁ డౌకొడుకు
చేఁ గడు దుస్సహుఁ డయ్యె నయ్యెడన్. 44

చ. అరిపృతనోగ్రశౌర్యసము
దగ్రుని రాజసుతాన్వితున్ ధను
ర్ధరు నిజపుత్త్రకున్ మఖతు
రంగమరక్షకుఁ బంచిపంచి యం

దురుతరవిఘ్నముల్ ఘోరయ
కుండ శతక్రతుతుల్యుఁ డై నయాం
దోర యొనరించె శాస్త్రగతిఁ
దొంబదితొమ్మిదియధ్వరంబులన్.

ఉ. పిమ్మట యజ్వ యైనపృథి
వీపతి నూఱవయశ్వమేధముం
గ్రమ్మఱఁ జేయ వీడినతు
రంగమురాజ మనర్గళప్రచా
రమ్ములఁ ద్రిమ్మరం బ్రబల
రక్షిసమక్షమునంద యాతురం
గమ్మును దొంగిలించె బల
ఘస్మరుఁ డప్డు డదృశ్యరూపుఁ డై.

ఉ. కట్టెదురన్ మఖంపుఁదుర
గం బిటు లొక్కట మాయ మైన నె
ట్టె ట్టని యబ్బ్ర మంది వగ
నేమియుఁ దోఁచక తద్వరూథినీ
ఘట్టము లట్టె నిల్చునెడఁ
దక్షిణ మే విదితప్రభావ యై
నట్టివసిష్ఠధేను వపు
డచ్చటికిం జనుదెంచె నిచ్చమై.

ఉ. నందినిఁ గాంచి మ్రొక్కి బుధ
నందితభవ్యచరిత్రుఁ డావిరా
ణ్ణందనుఁ డప్డు డాత్మనయ
నమ్ములఁ బావన మాతదంగని

ష్యందజలమ్మునం గడిగి
నంత నతీంద్రియవస్తుదర్శనం
బందును గూడఁ దా వలఁతి
యయ్యెఁ దదీయమహత్త్వసంపదన్. 48

ఉ. చండకరాన్వయాంబునిధి
చంద్రునకుం గనుపట్టె నత్తఱిన్
దుండగమూని చేపడక
త్రుళ్లుమఖాశ్వము బిట్టదల్చి సూ
తుండు రథంపుఁబగ్గముల
తో బిగఁగట్టఁగఁ గొంచుఁ బోవునా
కొండలచెట్టుపల్ దునియఁ
గొట్టినదిట్టఁడు తూర్పుదిక్కునన్. 49

సీ. అలరారునెత్తమ్మికొలనిసొంపు వహించు
నని మేషము లగు వేగనులకతన
నుప్పరవీదిఁ గ్రేళ్లుఱికి పాఱుచుఁ బచ్చ
వన్నెఁ జెన్నగు వారువములకతనఁ
గేల నూఱంచులడాలు పిక్కటిలంగఁ
గ్రాలునట్టికడిందివాలుకతన
దివ్యలోకాధీశ తేజోగరిమ మీఱఁ
బూర్వాభిముఖుఁ డయి పోవుకతన

తే. నీతఁడు పురందరుం డని యెద నెఱింగి
రఘువు చద లంటునతిగభీరస్వరమున
బలిమి వెనుకకు మరలించువాఁడువోలె
నిట్లు వాక్రుచ్చె నాసురాధీశుతోడ. 50

మ. అమరాధీశ మఖాంశభోజనులలో
నాద్యుండ వీవే కదా
యమలాత్ముం డగునాదుతండ్రి మఖనీ
తాసక్తిం గావించు కా
ర్యము విఘ్నోపహతంబు సేయుటకుం గ
ట్టా యెట్టు లోర్చితివో
యమరారాతులు సేయుకృత్యములు గా
వా యజ్ఞవిధ్వంసముల్. 51

ఉ. ఈత్రిజగంబు ధర్మగతి
నేలెడునీవ కదా మఖక్రియా
శత్రుల దివ్యదృష్టిని వె
సం గని దండన సేయంగావలెన్
వృత్రహ యిట్టినీవ సుచ
రిత్రులు పూనెడుయజ్ఞసత్క్రియల్
ధాత్రి నడంతువేని యిఁక
ధర్మవిధుల్ నశియించునే కదా. 52

ఉ. కావున నధ్వరాంగ మయి
క్రాలెడునీతురగోత్తమంబు స
ద్భావముతోడ ధర్మపర
తన్ విడనాడుట నీకుఁ బాడి యాం
బావనపద్ధతిం బుడమి
వారికిఁ జూపెడుమిమ్ముబోంటిస
ద్దైవతశేఖరుల్ చెడుప
థమ్మును ద్రొక్కఁగ నియ్యకొందురే. 53

ఆ. అని ప్రగల్భముగ న।వాంబుదధ్వానగం
భీరఫణితి నక్కు।మారుఁ డనిన
నాలకించి యబ్ర। మంది తేరు మరల్చి
బలవిరోధి యిట్లు। బదులు పలికె. 54

ఉ. నీయనినట్టి దంతయును
నిక్కమ యారసి చూడ నైనను౯
దాయలనుండి కావవల
దా తమకీర్తి యశోధనుల్ మఖో
పాయముచే జగద్విదిత
భవ్యమదీయయశంబు మాప నీ
నాయన పూనినాఁడు నృప
నందన నే నిది పూను టొప్పదే. 55

క. పురుషోత్తముఁ డనుశబ్దము
హరికి మహేశ్వరపదంబు। హరునకును బలె౯
ధరణి ననన్యాశ్రయ మయి
నరపతిసుత శతమఖాఖ్య। నాకే చెల్లున్. 56

ఆ. కాన నీదుతండ్రి। క్రతువాజిఁ గపిలుని
రీతి నేన యపహ।రించినాఁడ
జతన మిందు నీకుఁ। జాలు నింకఁ గుమార
సగరసుతులత్రోవఁ। జనక పొమ్ము. 57

చ. అనవుడు బిట్టు నవ్వి యభ
యస్థిరమానసుఁ డాదిలీపసం
దనుఁడు సముద్ధతి౯ మగుడ
దైవతనాయకు నిట్లు పల్కెఁ గై

కొనుము సురేంద్ర శస్త్రమును
గొబ్బున నీమది నిట్టినిశ్చయం
బెనసెనయేని యీ రఘు జ
యింపక నీవు కృతార్థుఁ డౌదువే. 58

శా. ఆలేఖర్షభుతోడ నిట్లు తనవ
క్త్రాబ్జంబు పై కెత్తి వీ
రాలాపంబులు పల్కి ముల్కిని ధను
ర్జ్యావల్లి సంధింపఁగా
నాలీఢాంఘ్రిప్రశేషశోభి యగునై
జాంగి ప్రకర్షంబుచే
శూలిం బోలి యతల్చి నిల్చె మహీభృ
త్సూనుం డహీనోద్ధతిన్. 59

ఆ. అపుడు రఘువృషలుకకోటులుగలు చెందమ్ము
నాటి నొంప నమరనాథుఁ డలిగి
మబ్బులకు ముహూర్తమాత్రలాంఛన మైన
కడిఁదిపింట నమ్ము దొడిగి వేసె. 60

క. దానవరక్తోచిత మగు
నానారస మారఘువుబృహద్వక్షమునన్
వో నాటి చవి యెఱుంగని
మానిసిరక్తంబు వేడ్కమైబలెఁ గ్రోలెన్. 61

సీ. ముల్లోకములకును మూఁడునాపద లెల్లఁ
బాపి కాపాడఁ బెల్పడ్డదాని
బలజంభపాకాదిబహుదైత్యసంహార
కారణం బయి వన్నెఁ గన్నదాని

నైరావతమతంగజాస్ఫాలనంబునఁ
గఱకు లావ్రేళ్లచేఁ గ్రాలు దానిఁ
బౌలోమిచెక్కిళ్లపత్రభంగములచేఁ
జిహ్నితం బయి యుల్లసిల్లు దానిఁ
తే. క్రతుభుగీశ్వరుభుజమును గాఁడ నేసె
నాత్మనామాంకితం బొక్కయంబకంబు
హరిశరాహతి నొచ్చి కట్టలుక గదిరి
స్కందవిక్రముఁ డారాజనందనుండు. 62

ఉ. అంతటఁ బోక వెండియు నృ
పాత్మజుఁ డొండుశరమ్మునన్ మరు
త్వంతుమహాశనిధ్వజము
ధారుణిఁ ద్రెళ్లఁగఁ ద్రుంచివైచె లో
నెంతయు వజ్రి మండిపడి
యొక్క స్మయసూనునిమీఁద స్వారమా
కాంతను బల్మిఁ బట్టి కచ
ఖండనముం బొనరించినట్లుగన్. 63

క. గగనమున సురగణము సై
న్యగణము భువి నిలిచి చూడ నయ్యిరువురకున్
దిగుమొగములు నెగుమొగములు
నగునలుగులఁ దుములయుద్ధ మయ్యెం బిదపన్. 64

ఆ. తెంపు లేక పఱపు నంపవానల నైఁప
రాని తేజ మూను రాకుమారు
నడఁపఁ జాలఁ డయ్యె హరి స్వతశ్చ్యుత మైన
యనల మార్పలేని ఘనము వోలె. 65

ఆ. మథ్యమానజలధిరేమాడ్కిని హరిచంద
నాంకితప్రకోష్ఠమందు మ్రోయు
నల్లెత్రాడు ద్రుంచె నపు డర్ధచంద్రబా
ణమున నానుదక్షిణానుతుండు. 66

ఉ. ఖండితకార్ముకజ్యుఁ డయి
గ్రక్కున నవ్విలు పాఱవైచి యు
ద్దండతరప్రతాపసము
దగ్రుని నప్పగవానిఁ ద్రుంపఁగాఁ
గొండలచెట్టుపల్ నఱకు
ఘోరపుఁగైదువు గేలఁ బూని యా
ఖండలుఁ డెత్తివైచె నతి
గాఢతరాగ్రహమత్సరోద్ధతిన్. 67

శా. ఆదంభోళి యెడందఁ దాఁకి వివశుం
డై నేలపై వ్రాలె నా
యాదోనాథగభీరధీరమతి సై
న్యాశ్రుప్రపాతంబుతో
బాదం దా నొకమాత్రలోఁ దొలఁగి పో
వం ద్రోచి లేచెం గరం
బాదట మాని చెలంగు సేనలమహా
హర్షప్రణాదంబుతోన్. 68

ఉ. క్షాత్రసమగ్రతేజముప
సం బవిప్రేటు తృణీకరించి శ
స్త్రత్రుటితాంగబంధ మగు
శాత్రవమందును నిల్చి యున్నరా

ట్పుత్రునివీర్యలక్ష్మికిఁ గ
డుం బరితోషము నొందె వజ్రియుఁ
శత్రులకేనియుఁ సుగుణ
సంపద మెచ్చొదవించునే కదా. 69

ఉ. అప్పుడు వాసవుండు ప్రియ
మారఁగ నారఘుఁ జూచి పల్కె నో
యప్ప మహోద్రులం దునుము
నప్డును బల్మిని నడ్డు లేనినా
యిప్పవి నీవు దప్ప నొరుఁ
డెవ్వఁడు నోర్వఁగలేఁడు మెచ్చితిం
దప్పక యీతురంగమము
దక్కఁగ వేఁడు వరంబు నావుడున్. 70

తే. జాళువాపింజమెఱుఁగుల వ్రేళ్ళు లలర
నిషుధిలోనుండి కొంత పైకెత్తినట్టి
శరము నుపసంహరించి భార్గవసుతుండు
బదులు వల్కె నిట్లని ప్రియంవదుని హరిని. 71

తే. ప్రభువ గుఱ్ఱంబు విడువంగరాని దేని
సతతమఖదీక్షితుఁ డగుమజ్జనకునకును
నిది యథావిధి పరిపూర్తి నెనసెనేని
యేఫలం బబ్బు నాఫలంబెల్ల నిమ్ము. 72

తే. అష్టమూర్త్యంశ మగుట దురాసదుఁ డయి
యింట నున్నట్టినాతండ్రి యీతెఱంగు
నీదువార్తాహరునిచేతనే యెఱుంగు
నట్లు చేయింపుమయ్య లోకాధినాథ. 73

క. అనవుడు నట్టుల కాని
ష్ముని రఘునకు వర మొసంగి యరిగెన్ హరి దా
ననతిముదితమానసుఁ డై
జనపతికొలువునకు మరలి చనియెన్ రఘువున్. 74

ఆ. శక్రదూతచే రసాపతి మునుమున్న
సకల మెఱిఁగి హర్షజనితుఁ జేసి
పణఁకుపాణిచేత వజ్రప్రాంతుఁ మా
పుత్త్రునొడలు దడవి యుబ్బరించె. 75

క. ఈగతిఁ దొంబదితొమ్మిది
యాగమ్ములు చేసె నమ్మహారాజాయు
ర్యోగవిరతి దివి కెక్కఁగ
బాగుగ సమకట్టుమెట్లపంక్తియపోలెన్. 76

మ. శతకోటిప్రహతిన్ సహించి నఘువున్
సంతుష్టునిం జేసి తా
శతయాగమ్ములు చేసినట్టిఫలమున్
సామగ్ర్య మొప్పారఁగాఁ
బిత కిప్పించె మహాత్ముఁ డీతఁ డనుచుం
బృథ్వీజనం బెన్న ను
న్నతుఁ డాపుత్త్రునిఁ గూడి యుండెఁ బతి యా
నందాబ్ధి నోలాడుచున్. 77

క. ఈయది రఘూదయమునఁ దృ
తీయాశ్వాసము గ్రహింపు దీనిని గరుణా
తోయనిధాన త్రయీశిఖ
రాయతన యచింత్యరూప హతనతపాపా. 78

---

శ్రీ

రామచంద్రపరబ్రహ్మణే నమః.

# ర ఘూ ద య ము.

## చ తు ర్థా శ్వా స ము.

—•••—✶—•••—



శ్రీకరాంభోజనేత్ర సీతాకళత్ర
చిత్కళాధామ రఘురామ చిత్తగింపు
నీనవమిపూజకుం బుష్ప మైనయీర
ఘూదయమునందు నవల నింపొందుకథను. 1

చ. పుడమి నిరీతివైరిగి స
ముత్కటసంపదల్ భజింపఁగాఁ
గొడుకును గోడలుం గలసి
కూరిమి భక్తియు నుల్లసిల్ల నె
ప్పుడుఁ దమ్ముఁ గొల్చుచుండఁ బరి
పూర్ణమహోత్తరభోగతృప్తిమై
నెడఁద విరాగసంపద వ
హించె దిలీపుఁడు దాను దేవియున్. 2

సీ. అంతకంతకుఁ గాంక్ష లడరించునింద్రియా
ర్థములఁ దోఁచెడునని త్యతఁ దలంచి

రవివంశ్యులకుఁ గులవ్రతముగాఁ జెల్లుని
ర్మలవృద్ధరాజధర్మంబు దలఁచి
యఖిలావనీమండలాననమనుమము బా
గొనములఁ బరరాష్ట్రకొడుకుఁ దలఁచి
ప్రాయంబు గడు మీఱె కేశపామార్గగతిఁ జూచి
కొనఁ దగియున్నట్టికెలనుఁ దలంచి

తే. క్షితికిఁ గొమరుని బట్టాభిషిక్తుఁ జేసి
యఖిలసామ్రాజ్య మాతని కొప్పగించి
దేవియును దాను నాఁటికోనాఁటిపూర్వుఁ
డడవి మునివృత్తిఁ గాలంబుఁ గడప నెంచె. 3

తే. ఇట్లు కృతనిశ్చయుం డయి యానృపవరుండు
కులగురునియనుమతిని జేకొని యమాత్య
వరులతోఁ జెప్పి యొకనాఁడు వేకువను మీఱఁ
దనయు రావించి యేకాంతికముగఁ బలికె. 4

శా. అన్నా నే నిటఁ జేయఁగా వలయుకృ
త్యంబుల్ దగం జేసితిన్
నిన్నున్ వంశధురీణునిం బ్రజలకుం గం
టిన్ సౌరభేయోక్తులన్
జన్నంబుల్ శత మాచరించితిఁ బ్రభ
త్వైశ్వర్యసంపత్తిచే
నన్నింటం జరితార్థుఁడైతి నికనే
లా నాకు నిం దుండఁగన్. 5

మ. కలకాలంబును రాజ్యభోగములఁ జ
క్కం బొందుచుండంగ రా

జాలకుం గాదు ప్రజావనంబునకు ద
క్షుం డైనపుత్త్రుండు దాఁ
గలుగం దోడన వానిపైఁ బుడమివ్రే
కం బుంచి యారణ్యసీ
మలయందుఁ మునివృత్తి నుంట నృపధ
ర్మం బింతయుం బుత్త్రకా. 6

ఆ. కాన నాకు నిపుడు § కాన వానప్రస్థ
వృత్తి నుంట యుచిత § వృత్తి సూవె
వంత యేల కొఱ ర § వంతైన లేదుగా
నీకు మదిఁ గలంగ § నీకు కుఱ్ఱ. 7

మ. ఇనవంశ్యుల్ సను త్రోవఁ బోవలయుఁ గా
కెన్నాళ్లు నీయున్నతిం
గనుచున్ నెమ్మది నిందు నున్నఁ గడు మే
ల్గాదే కటా పుత్త్ర నీ
కనులన్ నింపకు నీరు నీరుచిరవ
క్త్రం బీగతిం జిన్నవో
యిన నేఁ జూడఁగఁ జాల నింతకును నీ
కేచింత యిం తేటికిన్. 8

సీ. భయభక్తిసంయుక్తి § బహురత్నసూతి యై
జలధిమేఖల నిన్నుఁ § గొలుచుచుండు
గణనీయరూపస § ద్గుణధుర్య భార్య ని
న్నానందజలధి నో § లార్చుచుండుఁ
బటుదైవమానుషా § పదలఁ బాపి వసిష్ఠుఁ
డనిశంబు నీసేమ § మరయుచుండు

నస్మదన్వయకీర్తి యగుపవిత్రమూర్తి యనుండు దాఁ
బై నుండి నిన్నుఁ గాపాడుచుండు
తే. నాకు ని న్నిచ్చి యస్మదన్వయము నిలిపి
నట్టినందిని నీకుఁ దోడుగనుంచినాఁడు
నీ వతులనీతివిద్యావివేకబుద్ధి
వేను నీ కుండ నయ్యెన కేమి తక్కువ. 9

చ. భవజలరాశి దాఁటుటకుఁ
బంకజనాభునిసేవ నావ యీ
భువి నినుఁబోఁటిసర్వగుణ
పూర్ణునిఁ బుత్త్రునిఁ గన్నతండ్రి కి
ట్టివయసునన్ ముకుందునిఁ గ
డిందిగఁ గొల్చి తరించు పెంపు గ
ల్గవలదె దీనికిన్ ముదము
గాంచక కొందల మందఁ బాడియే. 10

సీ. హరినామకీర్తనం బాచరించెడుబల్మిఁ
బాసి నాలుక తడంబడక యుండ
శౌరిపూజలు సల్పఁ జాలుశక్తిఁ దొఱంగి
కరములు కంపంబు వారయ కుండ
నబ్జాక్షుసత్కథ లాలకించెడుభాగ్య
మెడలి వీనులు చెవుడుపడక యుండ
శ్రీనాథపదయుగధ్యానంబునకుఁ గాక
చిత్తంబు చింతలం జివుకకుండ
తే. భూరిశుభదాభిధేయు సత్పూజనీయు
ననఘచారిత్రరమ్యు ధ్యానైకగమ్యు

విష్ణుఁ బ్రభవిష్ణు సంసారతృష్ణ విడిచి
కొలువ కున్న విముక్తి గల్గునె కుమార. 11

క. వార్ధక మొదవకయ భవము
సార్థకముగఁ జేఁత వలయు శ్రీహరిపదసేవా
త్యర్థుం డయి యంతిమపురు
షార్థం బర్థించునట్టి యమలాత్మునకున్. 12

ఉ. ఎంతవివేకవంతులకు
నేనియు సంగతి యంతరంగవి
భ్రాంతి ఘటింప కుండదు దు
రంతనిశాంతనితాంతవాస మ
త్యంతవిరోధి యోగికక
ళాభ్యసనంబున కిం తెఱింగి యే
శాంతికి మూల మాట వన
సంస్థితి మే లని యూఁది రాదిముల్. 13

ఉ. కావున నాకు నిష్ఠ చనఁ
గాఁ దగు నీకును నియ్యెకోఁ దగుఙ్
భూవినుతంబుగాఁ బ్రజలఁ
బ్రోచుచు సర్వసుఖమ్ము లొంది య
జ్ఞావళి వేల్పులం దనిపి
యాత్మభవార్పితభూభరుండ వై
యీవును మావలెఙ్ వనికి
నేఁగెదు వాఁడవు కా కుమారకా. 14

చ. అని సుతు నూఱడం బలికి
యప్పతి యాతనియియ్యకోలు గై

కొని కులవృద్ధమంత్రిగురు
కోవిదరాజసమక్షమందు నా
తనుజునకున్ సమస్తవసు
ధాతలరాజ్యమహాభిషేకముం
బొనరిచి యిచ్చె మౌక్తికస
ముజ్జ్వలదేకసితాతపత్రమున్. 15

ఆ. ఇట్లు రఘువునకు మహీరాజ్యపట్టాభి
షేక మాచరించి క్షోణి మెచ్చ
దేవితో మహాతపోవని కేఁగె ని
ర్లేపుఁ డైనయాదిలీపుఁ డపుడు. 16

మ. గురుదత్తం బగురాజ్యమున్ రఘువు గై
కొంచుం గడున్ భాసిలెన్
హరిదశ్వద్యుతి మాపు నూని జ్వలితుం
డౌ పావకుండున్ బలెన్
ధర దీనిన్ వినురాజకోటియెడఁ
దోఁత్తెన్ రాఁజుచున్నట్టిభీ
కరసంతాపమహాగ్ని ప్రజ్వరిలె నాఁ
గాఁ బేర్చె నొక్కుమ్మడిన్. 17

సీ. ఇంద్రధ్వజముఁ బోలె నీ నృపునవాభ్యుదయము నా
రసి సంతసిలిరి సకలప్రజలు ప్రజలు
పితృసమాగతసింహాసనపీఠితో నొకటఁ దా
నరిమండలము నాతఁ డాక్రమించెఁ
గమల ఛాయామండలమునఁ దోఁచెడుతమ్మి
గొడు గూని కనరాక కొలిచె నతనిఁ

దగినవేళల వందిసంతతులభారతి దోఁచి
యంచితస్తుతులఁ బూజించె నతని
తే. మనువు మొదలు గాఁగ మాన్యు లౌ రాజేంద్రు
లనుభవించి విడిచినట్టి దయ్యు
నతనియందుఁ దా ననన్యపూర్వయపోలె
నపుడు ననురక్త యయ్యె వసుధ. 18
సీ. చలియు వేఁడియుఁ గాని సమలయానిలము ప్రోలెఁ
దగుదండమునఁ బ్రజం దనియఁ జేసె
మావిపూవును బండు మఱపించుచందానఁ
దాఁ గడుఁ మఱపించెఁ దనదుగురుని
నదనన్నయము నీతి విదులచే నెఱిఁగి యం
దాదిపక్షము నె తా ననుసరించెఁ
బంచభూతగుణాళిఁ బెంచి తాఁ గ్రొత్తమై
యఖిలంబుఁ గ్రొత్త యైనట్లు చేసె
తే. జనుల కానంద మిడుటచేఁ జంద్రు పేరు
తాపమును గొల్పుటం జేసి తపను పేరు
సార్థ మైనట్లు ప్రకృతిరంజనముచేతఁ
దనదు రాజాఖ్య నతఁడు సార్థకముఁ జేసె. 19
క. ఆకర్ణాంతవిశాలము
లౌ కన్నులు గలవు గాని యానరపతి యా
లోకించు నెపుడు సూక్ష్మము
లౌ కర్జంబులను దెలుపునాగమదృష్టిన్. 20
తే. శత్రుశమనంబుచేత స్వాస్థత వహించి
యిట్లు రఘురాజు రాజ్యంబు నేలుచుండ

నతినిఁ బ్రాపించె నట శరదృతుమతల్లి
కమలాయుత యై మఱొక రాజ్యశ్రీ మయుఁబోలె. 21

చ. కురిసి పడుక్ లఘుస్థితి మొ
గుళ్లైన వ్రేఁగిడు దుస్సహంబు లై
తరణిప్రతాపముల్ రఘుప్ర
తాపము నొక్కటఁ జేర్చి పక్కలక్
హరి విడనాడె వార్షికశ
రాసన మెక్కిడె జైత్రకార్ముకం
బు రఘువు విండులిద్వ రిటు
ప్రూనుట లోకహితార్థమే కదా. 22

క. తామరగొడుగును విరిస
తోఁకలు శరచామరములు గాఁగొని శరదృతు వా
భూమీశు ననుకరించియు
నామహితునిశోభ నందలేదయ్యెం దుకున్. 23

ఆ. సుప్రసాదకరము సుముఖుఁ డగు నాతని
నతివినిర్మలాంశుఁ డైన చంద్రుఁ
జూచుచున్నయట్టిచూపు లెల్లను
బ్రీతి యస్వ డొక్క రీతి నొదనె. 24

సీ. హంసతారాకుముదాకరంబులయందుఁ
గలసిన ట్లుండెఁ బక్షిప్రయాసములు
చెఱకునీడల నుండి చిననాఁటికథలఁ శా
లిగోపులు తన్ముగ్ధశమును బాడి
రంబు లగస్త్యోదయమునఁ దేఱె రఘూద
యముచేత నరులడెందములు గలఁగెఁ

బాగ రెక్క మూఁపురంబులు గల్గి యేళ్లయొ
డ్లను గూల్చునాఁబోతు లెనసె నతని
తే. హస్తిమదగంధులైన యేడాకుటరఁటి
పూలచేఁ గొట్టువడి మహీపాలుగజము
లీసునం బోలె నవ్వేళ నేడుగతుల
మదముఁ గురిసెఁ దుమ్మెదలు ప్రమదము నొంద. 25
క. నదులను లోఁ తెడలించి బు
రదదారి నిగిర్చి యాశరత్కాలము త
ద్విదితోత్సాహముకంబైను
మొదటన దిగ్యాత్ర కవ్విభుని బురికొల్పెన్. 26
ఆ. ఆజగద్విభునకు వాజినీరాజనా
విధిని విధియుతముగ వేల్చినట్టి
యగ్ని దాఁ బ్రదక్షిణార్చిర్మిషంబుచే
శయముచేతఁబోలె జయ మొసంగె. 27
సీ. తనరాజధాని నేరును దేఱి చూడనే
నలవి గాకుండ సైన్యముల నిలిపి
ప్రాంతదుర్గమున కొక్కింతేనియుఁ గొఱంత
గలుగకుండ బలంబు గాపు వెట్టి
తన వెన్క నొకకీడు మొనయ కుండఁగ సేన
లనిశంబు గావఁ గట్టనుపుపఱిచి
దేవతాపూజనాదికభవ్యసత్క్రియల్
సలిపి షడ్విధమైనబలము గూర్చి
తే. మందరోద్ధూతఘనపయోబిందువులను
హరిపయిఁ జల్లుక్షీరాబ్ధితరఁగలట్లు

పౌరసతులు లాజలఁ దనపైని జల్ల
వెడలె దిగ్విజయార్థ మప్పుడమిఱేఁడు. 28

సీ. సజలాబ్దనిభగజవ్రజముచే రజముచే
మన్ను మిన్నును మిన్ను మన్నుఁ జేసి
మండుటెడారుల నెండఁగప్పి ద్రోలంగ
వలసినంత జలంబు గలుగఁ జేసి
నావలచే దాఁటఁగా వలసినయేళ్ల
సులువుగాఁ దరియించుకొలఁదిఁ జేసి
యతిదుష్ప్రవేశంబు లగుమహారణ్యంబు
లెల్లఁ దా బట్టబయల్గఁ జేసి
తే. జవనపవనవిధూతకేతువులచేత
నహితనృపులఁ దర్జించుచున్నట్టు లడరి
యింద్రసముఁడైన యారాజచంద్రుఁ డపుడు
తొలుదొలుత సేనతో నేఁగెఁ దూర్పుదెసకు. 29

ఆ. తొలి ప్రతాప మవలఁ గలకలం బామీఁద
దుమ్ముఁ బిదప నిజబలమ్ముఁ దోఁప
నాల్గుమొగ్గరములు గల్గి యున్నదివోలెఁ
గానఁబడుచు రఘువుసేన నడచె. 30

క. తూరుపుకడలిని బలుమొనఁ
జేరుపఁ దోకొనుచు నేఁగె క్షితిపాలుఁడు మా
రారిజటాచ్యుతగంగను
దూరపుకడలిని భగీరథుఁడు సేర్చుగతిన్. 31

తే. ఫలము లెడలించి వడిఁ బెల్లగిలఁగఁ జేసి
పలుగతుల రాజులను భంగపఱచుచు చరుగు

నారఘువుదారి గడుఁ డెల్ల మయ్యె నపుడు
తరుల విఱుచుచుఁ జను నేన్గు తెరువు వోలె. 32

తే. జనవిభుఁడు తూర్పుదెస నున్న జనపదముల
నిప్పగిది నాక్రమించుచు నేఁగి యేఁగి
లాలితోత్తాలతాలీవనాళిచేతఁ
గారుకొన్న మహాబ్ధి చెంగటికి నరిగె. 33

సీ. వంగనివారల భంగపెట్టెడునమ్మ
హారాజువలన సుహ్మాధిపతులు
తటినీరయమున వేతసముల ట్లొదలక
వంచి ప్రాణములు దక్కించుకొనిరి
యోడలతోడఁ దన్నోడింప సమకట్టు
వంగాధిపుల బల్మి లోఁగఁజేసి
యమలగంగాఘూంతరాంతరంబులయందు
గెల్పుఁగంబంబుల నిల్పె నతఁడు

ఆ. మొదల నూడఁబెఱికి పిదప నాటుటఁ జేసి
తలలు వంచి పాదములను వ్రాల్చి
దొరలు సత్ఫలముల వరిపెన్నులటు లర్క
కులజునకును బెంపు గూర్చి రపుడు. 34

సీ. దంతిసంతానంబు వంతెనగా నిల్పి
దానిపై నాత్మీయసేన నడపి
కపిశను దాఁటి యుత్కలభూపతులు సూపు
సరణిఁ గళింగదేశమున కరిగి
గంభీరవేది యాగజము నౌదలమీఁద
బరిగోల నిల్పు మావంతువోలె

నతిదుస్సహంబైన యాత్మప్రతాపంబు
నలమహేంద్రాద్రియాదలను జేర్చి

తే. యే పెనఁగుఱేనిఁ గాళింగుఁ డెదురుకొనియె
దంతిసాధనుఁడై మహాస్త్రములతోడ
ఱెక్కలుడుపఁ గడఁగు వేల్పుఱేనిఁ గిట్టి
ఱాలు గురియుచు నెదిరించు శైలమట్లు. 35

ఆ. మంగళాభిషేకముం గైకొనినభంగి
నమ్మహేంద్రపర్వతమ్మునందు
నరులు పఱపు కఱకుటంపవాన సహించి
విజయలక్ష్మి నవనివిభుఁడు పొందె. 36

ఆ. అన్నగమున జోదు లాపానభూముల
ననువుపఱచి యరులయశముఁ బోలె
నలపు దలఁగఁ దములపాకుదొన్నెలతోడఁ
గ్రోలి రపుడు నారికేళమధువు. 37

చ. కలన మహేంద్రనాథు నరి
కట్టియుఁ బట్టియు వీడి ధర్మసం
కలితజయార్థి ఱేఁడు సిరిఁ
గైకొనెఁ గైకొనఁడయ్యె భూమి న
వ్వల ఫలశాలిపూగతరు
వారమనోహరమైనసంద్రపుం
జెలియలికట్టఁ బట్టి జయ
శీలతమైఁ జనె దక్షిణాశకున్. 38

ఆ. కరిఘటామదాంబుసురభి యాసైన్యసం
భోగచిహ్నములను బొరయఁ జేసి

సరిదధీశ్వరుండు శంకించునట్లు గా
వించె నవ్విభుఁడు కవేరతనయ. 39

సీ. తరువాత నొకకొంత దవ్వేఁగి బడలిన
సేనలతో నృపశేఖరుండు
మిరియంపుఁజెట్ల నెగురుగిజిగాఁడుల
నలరుగందపుఁగొండ కెలన విడిసెఁ
దురగముల్ ద్రొక్కన పరువంపు ఏలకి
సండ్లదుమారంబు పైకి నెగసి
వలపులఁ దమసాటి వచ్చుమత్తకరీంద్ర
తతులగండములందుఁ దవులుకొనియె

తే. ఘనఫణులు చుట్టుకొనినచందనపుఁజెట్ల
నేర్పడినయట్టితట్టులం దిడుటఁ జేసి
కాలికొలుసులఁ జిద్రుపలుగా నొనర్చు
సమదగజముల మెడకట్లు జాఱవయ్యె. 40

ఉ. తమ దెస వచ్చునారవిప్ర
తాపము సైతము తగ్గఁ జేయుదు
ర్దము లలపాండ్యులార రఘుప్ర
తాపము నోర్వఁగఁజాల కబ్ధిసం
గమమునఁ దామ్రపర్ణిఁ బొడ
కట్టినచక్కని మేలియాణిము
త్యముల నెఱింగి యిచ్చిరి చి
రార్జిత మా తమకీరితిఁ బలెన్. 41

చ. సలలితచందనం బగుది
శాసతిచన్గనఁ బోలె నమ్మహీ

తలపతి యిచ్ఛమై మలయ
దర్దురశైలయుగంబుఁ బట్టి తా
జలనిధి దవ్వులన్ విడుచు
సహ్యమహాద్రిని బొందె నాపయిన్
వలువ దొఱంగి చక్కఁగను
పట్టెడుభూమిపిఱుందునన్ బలెన్. 42

సీ. అటనుండి చని పడమటిదేశముల గెల్వ
నరుగునాఱేనిసైన్యములచేత
రామాస్త్రములను దూరము దొఱంగియును స
హ్యాద్రి నంటినయట్టు లయ్యెఁ గడలి
వెఱపుమైఁ దొడవులు విడి వాలుకేరళ
తరుణీజనంబుముంగురులయందుఁ
గుంకుమచూర్ణంబు కోమగు నాపాదించె
రాగోజ్జ్వలచమూపరాగచయము
తే. విమలమురళానదీమారుతముల రేఁగు
మొగలిక్రొంబూలదూళి యాజగదధీశు
మగలు దొడిగినకడిఁదిమైమఱుపులకును
గోరకయ కల్గుబుక్కాముగా రహించె. 43

సీ. నడచుగుఱ్ఱంబులయొడళులం దనిశంబు
మర్మరధ్వని సేయువర్మచయము
గాలిచేఁ గదలుశ్రీతాలీవనీసీమ
లందుఁ బుట్టురవంబుఁ గ్రిందుపఱచె
బలుపుచిట్టీఁదుచెట్టులబోదెలం గట్టు
మదసముద్ధారిసామజకులంబు

గండస్థలములందు గండుఁదుమ్మెదచాలు
వ్రాలెఁ జెంగటిపొన్నపూల విడిచి
తే. తనుఁ బరశురాముఁ డటు వేఁడుకొనుటఁ జేసి
కొలఁదిచొ ట్టిచ్చినట్టియాసలిలరాశి
యమ్మహారాజునకు నపరాంతరాజ
కైతవంబున నర్పించెఁ గప్ప మపుడు. 44
సీ. కోరాడుమదపుటేన్గులరదక్షతులచేఁ
కమనీయవిజయాక్షరములు వ్రాసి
యచ్చోట నాత్రికూటాద్రినే యెత్తైన
గెల్పుఁగంబము గాఁగఁ జల్పె నతఁడు
యోగి తత్త్వజ్ఞానయుక్తి నింద్రియశత్రు
గణమును గెలువంగఁగడఁగునట్టి
లారా జనల నేలదారిని బట్టి తాఁ
బారసీకుల గెల్వ బయలువెడలెఁ
తే. దామరలమీఁదిలేయెండఁ దలఁగునట్టి
యసమయోద్భూతమేఘోదయంబు వోలె
యవనకాంతామణులయాననాంబుజములఁ
మధుమదంబును బాపె నమ్మనుజవిభుఁడు. 45
సీ. గుఱ్ఱంపుదండుఁ జేకొని వచ్చి పాశ్చాత్య
నృపతులారఘురాజు నెదురుకొనిరి
యన్యోన్యజయకాంక్ష లడరి పోరెడువారి
కొక్కుమ్మడిని దొమ్మియుద్ధ మయ్యె
రోదసీకుహరంబు మేదురంబుగఁ జేయు
ఘనపరాగమునఁ జీఁకటులు గవిసె

వెరవార జోదు లొంగడారు ధనుష్టంకృతి
స్వనముచేత నెఱుంగఁజాలి రపుడు
తే. పఱపుసరఘులు గలతేనెపట్లఁబోలె
వారిశ్మశ్రుల శిరముల వసుధఁ గప్పి
నిహతశేషులు శరణన్న నృపుఁడు గాచె
మ్రొక్కు చేఁ దీఱుఁ గద మహాత్ములకు నలుక. 46
ఆ. భటులు మేలితోల్తివాసుల ద్రాపైని
కుంజములను బఱచికొని వసించి
మదము గొలుపుమధురమధురసంబుల చేతఁ
దలఁగి రపుడు గెలుపువలనియలపు. 47
చ. కరముల వారిఁ జక్కడఁచఁ
గాఁ జనుసూర్యుఁడువోలె ఱేఁడు దా
శరములఁ దద్దిశాధిపులఁ
జక్కడఁచం జనె నుత్తరాశకున్
మురు వగుసింధుతీరములఁ
బొర్లి క్రమంబఱి లేచి తచ్చమూ
హరు లట దుల్పెఁ గందముల
నంటినకుంకుముఘ్రావ రేకులన్. 48
సీ. పటుతేజమున నాత్మభర్తృసంతతిఁ గిట్టి
చెండాడు నాఱేని చేష్టితంబు
హూణరాజేంద్రులరాణివాసముల చె
క్కిళులందుఁ గెంజాయ గీలుకొలిపెఁ
గాంభోజనృపతు లాయంభోజహితవంశ్యు
నుగ్రప్రతాపంబు నోర్వ లేక

ఘనమదేభములఁ గట్టినయట్టియంకోల
వృక్షసంతతులతో వినతు లైరి
తే. యమ్మహీశ్వరు లపు డుత్తమాశ్వచయము
కనకరాసులు గొని తెచ్చి కానుక లిడఁగ
వానిఁ గైకొని దయఁ గాచె వారి రఘువు
గాని దానికి నెద గర్వ మూనఁడయ్యె. 49
సీ. తరువాతఁ బార్వతీగురు వైనకొండ న
జ్జనపాలుఁ డెక్కె నశ్వములతోడఁ
దురగోత్పతితధాతుధూళి నాగట్టుశృం
గాగ్రంబు లెదుగుచున్నట్టు లొప్పె
జలజలప్రవహించు సెలయేళ్లచప్పుళ్ల
నెనసి సైన్యారావ మినుమడించె
బలఘోషమున సంభ్రమతఁ గ్రమ్మఱి చూచె
గవులందుఁ బండుసింగములగములు
తే. భూర్జతరుల మర్మరారావములు ఘటించి
బొంగువెదురులఁ బాట లెసంగఁ జేసి
గాంగశీకరములచేతఁ గరము దడిసి
వీచుగాలులు దారి నవ్విభుని గొలిచె. 50
సీ. దట్టంపుసురపొన్నచెట్టునీడలఁ బండు
కస్తూరిమృగములకతన వలచు
జాతిబండలపై మహీతలేశ్వరభటుల్
మించువేడుక విశ్రమించి రపుడు
సరళసక్తము లైనకరులపెన్మెడకట్టు
గొలుసులఁ దలతల వెలుఁగఁ జేయు

నోషధివల్లు లాకయుర్వీశ్వరునకుఁ దై
లంబు గోరనిప్రదీకపంబు లయ్యె
తే. ధరణిపతి పీడి చనువిడికగలలయందుఁ
గరులమెడకట్లరాయిడిఁ క గరము చిదిగి
తట్టువడు దేవదారులకపట్టి లతని
యేనుఁగులయెత్తు బోయల క కెఱుఁగఁ జెప్పె. 51
క. శరములు గుదియలు రాలును
నొరసి యనల ముప్పతిల్ల క నుగ్రం బగునం
గర మయ్యె నందు నాభా
స్కరకులునకుఁ బార్వతీయకగణములతోడన్. 52
క. ఉత్సవసంకేతుల విగ
తోత్సవులం జేసి నిజజకయోదాహరణం
బుత్సుకతం బాడించె మ
హోత్సాహుఁడు ఱేఁడు కిన్నకరాఘుము చేతన్. 53
ఆ. వారు గానుకలఁ గకరారవిందములందుఁ
బూని యాదిలిపకపుత్త్రుఁ గొలువ
జేనిసార మెఱిఁగి క నాగం బకొండ
సార మెఱిఁగె నమ్మకహీరమణుఁడు. 54
తే. ఎదురు లేనియశోరాశి క నేపు మీఱ
నృపతి యమ్మంచుమలమీఁద క నెలవుకొలిపి
రావణుం జెత్తి విడిచినకరజతగిరిని
సిగ్గువఱచున ట్లటనుండి క డిగ్గె నపుడు. 55
సీ. ఇటు డిగ్గి రఘువు లౌకహిత్యానదిని దాఁటి
నంతనే ప్రాగ్జ్యోతిషాధినాథుఁ

డేనుంగులకును నాలానంబు లైనట్టి
కాలాగురువులతోఁ గప్పు వడంకి
మబ్బులు లేకుండ మార్తండుఁ గప్పి దు
ర్దినము గావించు నానృపవరేణ్యు
రథపరాగమునె యోర్వఁగ లేక వెఱచెఁ ద
త్సేన నోర్వఁగలేమి చెప్ప నేల

తే. యన్యనృపజయహేతువు లైనకరులఁ
గామరూపేశుఁడు నొసంగి హేమపీఠి
వఱలుతత్పదచ్ఛాయ దేవతనుబోలె
రతినపుంబూలతోడ నర్చన మొనర్చె. 56

ఆ. ఇట్లు నలుదెసలు జయించి యాజయశీలుఁ
డరదములను రేఁగుధరణిరజము
వెల్లగొడుగులకును వెలి యైనరాజుల
సిగల నిలుపు చాత్మనగరి కరిగె. 57

చ. లలితనిరీక్షణాస్త్రజము
లం బురకాంతలు పుష్పతోరణం
బులఁ బచరింపఁగా నగరు
భూపతి సొచ్చి యనంతరంబ తాఁ
గలధన మెల్ల దక్షిణకుఁ
గా నిడి విశ్వజిదాఖ్యయజ్ఞముం
జలిపె మొగుళ్లకుఁ బలెను
సాధుల కార్జన యీగికే కదా. 58

చ. ధరణిపుఁ డధ్వరాంతమునఁ
దా మును గూర్చుపరాజయవ్యథా

భరమును భూరిసత్క్రియలఁ
బాపి ప్రమోదము గూర్చి నెమ్మిమైఁ
జిరవిరహోత్సుకప్రియలఁ
జేరఁగఁ దోడన వీడుకొల్పె న
ధ్వరమును జూడ వెంబడిన
వచ్చిననాట్పటిరాజలోకమున్. 59

చ. అమలపవిధ్వజాదికశు
భాంకము లూని యనుగ్రహైకల
శ్యము లయి యొప్పునప్పతిప
దాంబురుహంబులవ్రేళులందు భూ
రమణులు మౌళిమాల్యమక
రందరజఃకణయుక్తి గౌరవ
ర్ణను ఘటియించి రత్తఱి నొ
నర్చెడుపైనపునందనమ్ములన్. 60

చ. సకలధనంబుఁ బాత్రులకు
జన్మమునం దిటు పంచిపెట్టి తా
నకలుషపాత్రదానసుకృ
తాప్తికి నప్పతి యుబ్బుఁ గాని శ్రీ
మికి మదిఁ గుందఁడయ్యెఁ బరి
మేయవినశ్వర మొనకల్మిచే
సుకృత మమేయశాశ్వతవి
శుద్ధపదప్రద మొందు టొప్పదే. 61

తే. ఇట్టు లుండఁగ నాఘూతకేశుకడకు
నఖిలవిద్యలు గురునొద్ద నభ్యసించి

యపుడు వరతంతుమునిశిష్యుఁ డైనకౌత్సుఁ
డరుగుదెంచెను గురుదక్షిణార్థి యగుచు. 62

తే. పసిఁడిపాత్రలేమిని మంటిపాత్రయందు
నర్ఘ్య మిడి యెదురుకొని యయ్యతిథి నుచిత
పీఠమున నుంచి పూజించి ప్రీతి మీఱ
నృపతి కేల్మోడ్చి యతనితో నిట్టు లనియె. 63

సీ. సేమమే మనుకృన్మహామౌనివరునకు
నియమతత్పరునకు నీగురునకుఁ
దఱుఁగు లేకున్నె యుద్యద్విఘ్నహాతిఁ ద్రివి
ధం బై యలరుతపంబునకును
భద్రంబె స్నానాదిపరమక్రియార్థ మై
యలరారుమీతీర్థజలములకును
గీడు మూఁడక యున్నె గాడుపుచేత మీ
పెంచినయాశ్రమవృక్షములకు

తే. సత్క్రియార్థము లైనఁ గుశలను మేయ
నిండుకూరిమి వారింప కుండుమునుల
యొడల నాభినాళము లూడి పడఁగఁ బెరుఁగు
లేడిపిల్లగములు లెస్సె లేమహాత్మ. 64

క. అతిథులకును మీజీవన
గతికి నయిననివరి మొదలుగాఁ గలపై రు
ద్ధతిఁ జెఱుప కున్నె గ్రామా
గతము లయినగోవృషాదికము లగుపశువుల్.

ఆ. కరుణఁ జదువు గఱపి గురుఁడు నీకును గృహ
స్థాశ్రమంబుఁ జొరఁగ నాజ్ఞ యిడెనె

యత్యుదార మగుగృహస్థాశ్రమంబు నొం
దంగ నీ కిదే యదను గదయ్య. 66

ఉ. నీగురుఁ డంప వచ్చితివొ
నీవయి వచ్చితొ నాకు గౌరవ
శ్రీ గలిగింపఁగా విబుధ
శేఖర పూజ్యుఁడ వైనయిట్టినీ
యాగమనంబునం దనియ
దాత్మ నియోగముఁ జేసి కాని వే
వేగమ యిష్టముం దెలుప
వే సమకూర్చి కృతార్థుఁ డయ్యెదన్. 67

ఆ. అనుడు రఘునియత్యుదారోక్తి నాలించి
యర్ఘ్యపాత్రకతన వ్యయము దెలిసి
తనదుకోర్కి తీఱ దనునాసఁ బాసి యా
నృపతితోడఁ గౌత్సుఁ డిట్టు లనియె. 68

తే. రాజ యన్నిట మాకు భద్రంబ చూవె
యీవు భువి నేలఁ బ్రజకుఁ గీడెట్లు కలుగుఁ
దరణి వెలుఁగుచు నుండఁగా ధరణి నిరులు
జనులచూడ్కుల నరికట్టఁ జాలునయ్య. 69

సీ. కులవిద్య మీఁకుఁ బూజ్యులమీఁద భక్తి దా
నను బూర్వులను మించినాఁడ వనఘ
యర్థినై నిన్నిట్టు లసమయంబునఁ జేర
వలసెఁగా యని వంత గలిగె నాకు
సార్వభౌముఁడ వయ్యు సవనజం బగులేమిఁ
దెలిపి కల్మికి వన్నె గొలిపి తీవు

సురలు గ్రోలినసుధాకరుకళాక్షతి వృద్ధి
 కంటె నెంతయును శ్లాఘ్యంబు గాదె
తే. గురుధనము దక్క మఱి వేఱుకోర్కి లేదు
 నాకు నది యొరు వేఁడికొనంగఁ బోదు
 నీకు శుభ మగాత నిగ్గతనీరజాం
 దాంబుదమును జాతక మైన నడుగునయ్య. 70
ఆ. అని వచించి లేచి యరుగం గడంగున
 మ్మౌనిశిష్యు నిలిపి మహిపుఁ డనియె
 ననఘ నీవు గురున కర్పింపవలసిన
 దేమొ యెంతొ నాకు నెఱుఁగఁ జెపుమ. 71
చ. అనవుడుఁ గౌత్సుఁ డిట్లను న
 రాధిప నేఁ బదునాల్గువిద్య లా
 యనపలనన్ గ్రహించి యన
 ఘా గురుదక్షిణ యేది యైనఁ గై
 కొను మని వేఁడ నీ దగున
 కుంఠితభక్తియ నాకుఁ జాలుఁ బొ
 మ్మనియె నతండు నే విడువ
 కమ్మునిఁ గొమ్మని బల్మి వేఁడితిన్. 72
తే. దానఁ గట్టల్కఁ బూని యమ్మౌని నాదు
 లేమి నెన్నక విద్దెలలెక్కఁ బట్టి
 నాకుఁ బదునాల్గుకోట్లధనమ్ము దెమ్ము
 పొమ్మని యదల్చె నేమి చెప్పుదు మహీశ. 73
క. నీయంతవాఁడు గా కొరుఁ
 డాయర్థం బొసఁగఁ జాలఁ డని వచ్చితి నీ

యీయర్ఘ్యపాత్రఁ గనుఁగొని
నాయాన మదిం దొలంగినాఁడం జుమ్మీ. 74

తే. అధిప విద్యాక్రియము చాల నధిక మగుట
నిన్ను నిబ్బంది పెట్టఁగా నేర నిపుడు
పోయివచ్చెద నన్న నాభూసురేంద్రు
తోడఁ గ్రమ్మఱ నిట్టు లానౌర వచించె. 75

సీ. శ్రుతపారగుండు భూసురుఁడు గుర్వర్థమై
రఘు వేఁడి నిజమనోరథము నొంద
కన్య వేఁడఁగఁ బోయె ననెడునీకీర్తిదూ
ఱుర్వి నాకును గల్గకుండఁ గాక
యనఘాత్మ నాదు త్రేతాగ్ని గేహమునందు
నాల్గవయగ్నిచందమున నీవు
రెండుమూఁడుదినంబు లుండు మీలోన నీ
కాంక్షితంబును దీర్పఁ గడఁగువాఁడ

తే. ననుడు నాద్విజుఁ డధిపుసత్యప్రతిజ్ఞ
నమ్మి యీకొనె నట్ల కానిమ్మటంచు
నవనిధనమును మును గొంట యరసి రఘువు
ధనదువలన ధనమ్ముఁ గైకొనఁగ నెంచె. 76

క. జలధులపయి మింట నగ
మ్ములపైఁ గరువలిని గూడుమొగులునకుబలెం
గలదు రఘుతేరి కవిహత
సలలితగతి గురునిమంత్రజలములమహిమన్. 77

తే. కాన నొకరాజమాత్రునిగాఁగ నెంచి
ధనదు బలిమిని గెలువఁగాఁ దలఁచి యపుడు.